శ్రీ ధన్వంతరయే నమః

# శ్రీ ధన్వంతరి
# పూజావ్రతకల్పము



ఇయ్యది

శ్రీమాన్ వైద్యవిద్వాన్ వేదాన్తం లక్ష్మణాచార్యులుగారిచే

సమకూర్చబడి

శ్రీమాన్ కవిరాజ

ప్రతివాదిభయంకర కృష్ణమాచార్యులువారిచే

పరిశోధింపబడి

విద్వద్వైద్య పండిత మద్దుకూరి రామబ్రహ్మం చౌదరిగారి

ద్రవ్యసహాయముచే ముద్రించి ప్రచురింపబడియె.

కాపీలు 1000.

కాపీ రైటు రిజస్టర్డు ] 1936 [ వెల రు 0-4-0.

A. G. Press, Bezwada

# విజ్ఞప్తి

అమృతోత్పాదనమునకై దేవదానవులు క్షీరసముద్రమును మథించు సమయమున శ్రీమహావిష్ణువు ధన్వంతరిస్వరూపమున అమృతకలశమును దివ్యౌషధములను గైకొని యావిర్భవించెను. ఆయుర్వేదోద్ధారకు డగు యీ దివ్యపురుషు డుదయించి ఆయుర్వేదవైద్యమును ప్రచార మొనర్చి లోకోపకార మొనర్చెను అటుపిమ్మట ఈమహామహుడే భూలోకమునందు కాశీరాజగు దివోదాసు డను నామముతో నవతరించి యెల్లరకు నాయుర్వేదముపదేశించెను. ఈ దివోదాసుడు ఆశ్వయుజ బహుళత్రయోదశి హస్తానక్షత్రమున జన్మించినట్లు తెలియుచున్నది. కాశీదేశమున వాడుకలోనున్న బార్హస్పత్యమానము ననుసరించి అచ్చటివా రీవ్రతమును ఆదినముననే జేయుచున్నారు. శ్రీమహావిష్ణుస్వరూపుండగు యీభగవంతుని వ్రత మెప్పుడు చేసినను చేయవచ్చును. దీనికై ప్రత్యేకకాలనిర్ణయములతో పని లేదు. ఆయుర్వేదోద్ధారకుడగుయీమహామహునిజన్మదినోత్సవమును వైద్యులెల్లరును విడువక ఆచరించుటయే ముఖ్యమై యున్నది. శ్రీధన్వంతరి వ్రతకల్పవిధానమును, పీఠవిగ్రహప్రతిష్ఠావిధానమును, చోడవరం వాస్తవ్యులును వేదాయుర్వేదవేత్తలునగు వేదాన్తం లక్ష్మణాచార్యులుగారు మిక్కిలి ప్రయాసతో సమకూర్చి గ్రంథరూపమున రచించిరి. ఈవ్రతకల్పవిధానము వైద్యుల కెల్లరకు నెంతయోయుపయుక్తముగానుండగలదు. వైద్యశాస్త్రమునకంతకు, ఆదిప్రవక్తయై రుజాపీడితమగు లోకముల కెల్లరుగ్వినాశనహేతుభూతుడై, ప్రజలకెల్లరకు ఆరోగ్యభాగ్యమును ప్రసాదించిన శ్రీధన్వంతరిమహాశయుని, వైద్యులే గాక వైద్యేతరు లెల్లరు భక్తితో నర్చించి ఆయురారోగ్యముల బడయ గోరుచున్నాను. ఈ గ్రంథము సకలజనులకు ఆదరభూతమై ఉపయోగకరమై యుండుననుటకు సందియము లేదు.

ఇట్లు,

ది 16-10-36,
బెజవాడ.

ఆయుర్వేదవిశారద, వైద్యవిద్వాన్,
చక్రవర్తుల నరసింహాచార్యులు, ఏ.ఆర్.ఏ.సి
సీనియర్ డాక్టర్,
శ్రీరామమోహన ఆయుర్వేద ధర్మవైద్యశాల.

శ్రీ

శ్లో॥ అమృతకలశహస్తం క్షీరపాథోధిజాతం
సకల విబుధ వంద్యం చాయురామ్నాయ దైవం
వినుత మఖిల దేవై శ్శంఖచక్రాయుధాఢ్యం
సకలగరవినాశం చింతయే వైద్యదేవమ్॥

వైద్యవిద్యానిపుణులారా?

వైద్యదేవుడగు శ్రీ మహాధన్వంతరిని పూజించుటకుగా నొకవ్రతవిధానముం దెలుపు గ్రంథముండుట ముఖ్యావశ్యకముగదా! ఏమీ యిదివరకు మహామహుల చే నిట్టిగ్రంథము లెన్నెన్నో కలవని యందురేమో! ఉండియే వున్నవి. అట్లుండు వ్రత పుస్తకములలో మంత్రములతోను శ్లోకములతోను, అనగా వేదోక్త, పురాణోక్తములు కలసియుండుట చేత, ఒకపక్షమవలంబించువారికి కొంతచిక్కుగా వున్నదని పలువురు సహజ మిత్రుల సలహాచే నే నిట్లు కేవలపురాణోక్తవిధిగా వుండవలయునని వుద్దేశముతో బ్రహ్మశ్రీ చివుకుల సత్యనారాయణ శాస్త్రులవారిచే నిదివరకు ధన్వంతరి వ్రతకల్పమును రచించి వారు ప్రకటన మొనర్చిన కల్పమును ఊతగాగొని యింక ఇతర వ్రతకథలలోనివియు పురాణయుక్తమని పెద్దలు నిర్ణయము చేసినవియు ముఖ్యముగా నిండుల కావశ్యకమగు హంశములను సమకూర్చి పండిత వరేణ్యులచే శోధనముగావించి శ్రీ మహాధన్వంతరి వారి కృపాకటాక్షము చేతను గురువర్యుల అజ్ఞ చేతను నా మిత్రుల ప్రోత్సాహముచే నంత శీఘ్రకాలమున నీ శ్రీమద్ధన్వంతరిపూజావ్రతకల్పమను గ్రంథమును వైద్యశిఖామణులకును వైద్యేతర మహాశయులకును అర్పించుకొను భాగ్యము నాకు కల్గినందుకు సంతసమొందుచున్నాను. ప్రతివారును యీ వ్రతకల్పముచే సులభముగా శ్రీ దేవదేవుని పూజించి ఫలితము నొందగలరనియే నాహృదయపూర్వకవిన్నపము. ఇంకను యీ పూజాకల్పము యొక్క అవశ్యకతను గూర్చి యీ గ్రంథపీఠికయందు శ్రీమాన్ కవిరాజ ప్రతివాది భయంకర కృష్ణమాచార్యులవారు విశేషములను విపులముగా వ్రాయించినందులకు నాకృతజ్ఞతావంద

నము లర్పించుచున్నాను. వారు వ్రాసిన విషయములు నాయం తెంత మాత్రమును లేకనియు, నా కంతమాత్రము ప్రవీణత లేనికారణమునను గ్రంథము వ్రాయుట కిదియే ప్రథమ మగుటచే నిం కెన్నెన్నో లోపము లుండి వుండును. గాన అట్టి లోపములను పూర్ణవాత్సల్యతతో మహామహులు నాకు వెంటనే తెలిపినయెడల శిరసావహించి పునర్ముద్రణమునందు సవరించుకొందునని అనేక వందనములతో ప్రార్థిస్తూయున్నాను. ఈ గ్రంథము ఎట్లు శీఘ్రకాలములో పెద్దలయొక్క హస్తములయందు విరాజిల్లునా యని విచారించుచుండ, నా మిత్రులగు మహారాజశ్రీ విద్వద్వైద్యపండిత మద్దుకూరి రామబ్రహ్మం చౌదరిగారు కల్పవృక్షమో యనునట్లు నాయీభారమును తాము వహించి ద్రవ్యసహాయమొనర్చినందులకు వారికి నాకృతజ్ఞతను దెల్పుకొనుచు శ్రీధన్వంతరిభగవానుడు సర్వదా వారిని రక్షించుగాతయని ప్రార్థిస్తూ యున్నాను. నన్ను ప్రోత్సహించిన మిత్రవర్గమంతకును శ్లాపందన శతము లర్పించుచున్నాను.

ఇట్లు,

గ్రంథకర్త.

బెజవాడ తాలూకా చోడవరం గ్రామ కాపురస్థులు

ఉభయవైద్యవిద్వాన్

## శ్రీమాన్ వేదాంతం లక్ష్మణాచార్యులుగారు

తయారుచేసిన యీ వ్రాతప్రత్తమును జూచి సంతసించితిని. సర్వసామాన్యమైన పురాణములనుండి గాక యియ్యది వేదాచారముల ననుసరించి యున్నది. శ్రీ ధన్వంతరి భగవానుని భక్తులందరు నారాధించుకొరకు ఈ గ్రంథమును అచ్చొత్తించి ప్రకటించుట యుక్తమని నా విశ్వాసము.

క్యాంప్ : బందరు, 12-1-36.

యం. ఆర్. స్వామి, ఎం. డి. పి. హెచ్. డి.
ఆయుర్వేదాచార్య, బెంగుళూరు.

# శ్రీ ధన్వంతరిపూజావ్రతకల్పము

## పీఠిక

దేవాంశమునను ఋష్యంశమునను అవతరించిన మహానుభావుల జన్మతిథులయందు పూజలును వ్రతములును జయంతులును ఆచరించుట శాస్త్రదృష్టమగు నాచారమై వచ్చుచున్నది. శ్రీకృష్ణాదులయొక్కయు శంకరాదులయొక్కయు జన్మతిథులయందు ఆయా జయంతులను జరుపుచున్నారము.

శ్రీ ధన్వంతరి సముద్రమథనకాలమున శ్రీ మహావిష్ణువు నంశంబున అమృతముతో నవతరించినటుల రామాయణాదిఇతిహాసములయందును భాగవతాదిపురాణములయందును కన్పట్టుచున్నది. అందుచే భగవదంశ సంభూతుడును అవతారపురుషుడును నగు ధన్వంతరికి జయంత్యుత్సవములును పూజలును జరుపుట ఉచితమే యగును.

శ్రీ వైద్యరత్న, పండిత, డి. గోపాలాచార్యులవారి ప్రోత్సాహముచే బెంగుళూరువాస్తవ్యులగు వి. డి. పండిత్ అనువారు కొంత పరిశీలన మొనర్చి ధన్వంతరివ్రతకల్పము నొకదానిని రచించి ప్రకటించిరి. పిమ్మట దాని ననుసరించి నిఖిలభారతవర్షీయవైద్యసమ్మేళనకార్యదర్శిగ నుండిన వైద్యపంచానన, పండిత జగన్నాథప్రసాదశుక్లగారొక వ్రతకల్పమును రచించి ప్రకటించి వైద్యసమ్మేళనపక్షమున తత్సభ్యులందరును ధన్వంతరి జయంతివ్రతము నాచరింపవలయుననియు ఆరోజున ధన్వంతరినిధిని వసూలుపరచి వైద్యసమ్మేళనకోశమునకు పంపవలయుననియు నొక నిర్ణయము నొనర్చియుండిరి.

ని. భా. వైద్యసమ్మేళనముయొక్క పై యేర్పాటువలన ధన్వంతరి జయంతివ్రతముయొక్క పరమోద్దేశము వ్రతాచరణముకాక నిధిసంపాదనముగ నేర్పడినది. ఎట్లయినను అనేకులు ధన్వంతరిజయంతి వ్రతాచరణమున శ్రద్ధవహించుటకు కారణమయ్యెను.

తరువాత ఆంధ్రవైద్యసమ్మేళన మేర్పరుపబడిన పిమ్మట ని. భా. వైద్యసమ్మేళన నియమనము ననుసరించి ఆంధ్రదేశమునను ధన్వంతరి జయంతివ్రతాచరణము విరివిగా జరుగసాగెను. వైద్యసోదరు లందరును క్షేత్రస్థలతో ఆ వ్రతమును జరుపుమండిరి.

ఈ సందర్భమున బ్రహ్మశ్రీ చివుకుల సత్యనారాయణ శాస్త్రిల వారు పైవ్రతకల్పములను కొన్ని పురాణగాధలను పరిశీలించి ఆంధ్రమున నొక ధన్వంతరివ్రతకల్పమును ప్రకటించి కీర్తిపాత్రులైరి. వీరిగ్రంథము వలన ఆంధ్రులకు మంచిసౌకర్య మేర్పడి ఆంధ్రులయందు వ్రతాచరణమున భక్తి శ్రద్ధలు ద్విగుణీకృతముగ పెరిగి ఉత్సాహము అతిశయిల్లి ప్రతిచోటు నను వ్రతాచరణము విరివిగ జరుగసాగెను. అప్పుడు ఆంధ్రదేశమున వైద్యు లందరునుకూడ ధన్వంతరివ్రతాచరణ మొనర్పుచుండిరన్న అతిశయోక్తి కాజాలదు.

ఈ సందర్భమున ధన్వంతరివ్రతాచరణమునకు యుక్తకాల మెయ్యది యను విషయమునం దొక యభిప్రాయభేద మేర్పడెను. అందుకు ముఖ్య కారణము లేవన; పండితులవారు ప్రచురించిన వ్రతకల్పమున:—

"ఆశ్వినే కృష్ణపక్షేవై త్రయోదశ్యాం గురోర్దినే
శతతారాఋక్షయుక్తే యామే ప్రాథమికే నిశి
ధన్వంతర్యాఖ్యయా చాహం ధనగుప్తవిముక్తయే
అవతీర్ణో యత స్తస్మాత్ సా తిథి స్సర్వకామదా."

అని యున్నది.

ప్రసాదశుక్లగారు ప్రకటించిన కల్పగ్రంథమున:—

"కార్తికే కృష్ణపక్షే తు త్రయోదశ్యాం గురోర్దినే
హస్తానక్షత్రసంయుక్తే యామే ప్రాథమికే నిశి
ధన్వంతర్యాఖ్యయా చాహం ధనం గుప్త మివోదధేః
అవతీర్ణో యత స్తస్మాత్ సా తిథి స్సర్వకామదా."

అనికలదు. సత్యనారాయణశాస్త్రిలవారివ్రతకల్పమునను శుక్లగారి కల్పమున నున్నట్టే కలదు.

శుక్లగారి వ్రతకల్పమున కార్తికకృష్ణపక్షత్రయోదశి వ్రతాచర ణమునకు యుక్తకాలముగ కన్పట్టుచున్నను ని.భా. వైద్యసమ్మేళనకార్య

కర్తలు అశ్వయుజ బహుళ త్రయోదశిని వ్రతాచరణమును ధన్వంతరినిధి సంపాదనమును చేయవలసినదిగ తాకీదులు పంపుచునుండిరి. దీనిని బట్టి వ్రతాచరణమున నాంధ్రప్రాంతమున ద్వైధీభావమేర్పడెను. దీనిని గురించి ఆంధ్రవిశ్వవైద్యపరిషత్తులయందును ఆంధ్రవైద్యసమ్మేళనములయందును అనేక వాదోపవాదములును చర్చలును జరుపబడెను. చివరకు వానిఫలితముగ నెల్లూరుపురమున జరిగిన వైద్యసమ్మేళనాధివేశమున కార్తికకృష్ణపక్షత్రయోదశిని కాని, ఆశ్వినకృష్ణపక్షత్రయోదశిని కాని ఈ రెంటిలో వారివారికి అనుకూలమగు సమయమున ధన్వంతరివ్రతముచేయ దగునని నిర్ణయింపబడెను. అప్పటినుండియు ఈ రెండుమాసములయందును ధన్వంతరివ్రతము జరుపబడుచున్నది.

ధన్వంతరివ్రతాచరణకాలమునుగురించి ఆంధ్రదేశమున కలిగిన ద్వైధీభావమును అందలి కారణములును, యుక్తులును, చర్చలసారాంశములును ఇచ్చట వివరించుట సందర్భముకాదు. కాని, ముఖ్యమగుకారణములు శ్రుతికల్పములయందలి వేరువేరు ప్రమాణములే యైయున్నవి. రెండవది ఆంధ్రదేశమున చాంద్రమానమును ఉత్తరహిందూస్థానమున బార్హస్పత్యమానమును ఆచరణయం దుండుటయు ఈ రెండుమానములనుబట్టి మాసములయందు భేదములు కలుగుచుండుటయు నైయున్నది. మూడవది ని. భా. వై. సమ్మేళనము నిధిని వసూలుపరచుటయే ధన్వంతరివ్రతాచరణమునకు పరమ ప్రయోజనముగ నుంచుకొని దేశమంతయు అశ్వయుజమాసముననే ధన్వంతరిపూజ సలుపవలయునని శాసించుటయు ఆంధ్రులు వ్రతాచరణమునకు శాస్త్రీయమగు ముఖ్యకాల మెయ్యది యని యన్వేషించుట కారంభించుటయు నైయున్నది.

ఈ మూడుకారణములను పురస్కరించుకొని ఆంధ్రులలో కొందరు సత్యనారాయణశాస్త్రులవారివ్రతకల్పమును ప్రమాణముగ స్వీకరించి కార్తికమాసముననే జరుపుచుండుటయు మరికొందరు మహామండలివారినియమనము ననుసరించి అశ్వయుజమాసముననే జరుపుచుండుటయు కలిగి రెండువిధములగు పద్ధతులు ఏర్పడినవి. ఈపద్ధతులపై కలిగినచర్చలపై రెండుకాలములను యుక్తములు కాగలవని నిర్ణయ మొనర్పబడెను.

శ్రీయుత వేదాంతం లక్ష్మణాచార్యులుగారు చాలకాలమునుండియు నాకు తెలిసినవారు. వైదికకర్మకాండలయందు ఎక్కువ తెలుసుకొని యుండువారు. అప్పుడపుడు వేదమంత్రముల కర్థములును, వ్యాఖ్యానములను వ్రాసి ఆంధ్రవైద్యసమ్మేళనపత్రికయందు ప్రచురించుచుండెడివారు. వేదాధ్యయన మొనర్చి కొంచెముగనో గొప్పగనో సంస్కృతభాషాసాహిత్యము సంపాదించి వేదకర్మలకు సంబంధించిన పద్ధతులయందును కల్పములయందును ప్రయోగపద్ధతులయందును పరిచయమును పరిశీలనమును అనుభవమును నేర్పడియుండుటచే చిరకాలముగ ధన్వంతరికి సంబంధించిన ఆలయములు, ప్రతిష్ఠ, చక్రములు, ఉద్ధారములు, వ్రతములు,పూజలు మొదలగువానినిగురించి పరిశీలించుచుండిరి. వీరిపరిశీలనమునకు ప్రథమఫలితముగ నీ వ్రతకల్పము వెలువడినది. క్రమముగ తక్కిన విషయములయందుకూడ వీరిపరిశీలనాప్రయోజనములు వెల్లడింపబడి ఆంధ్రుల శ్రేయస్సు కుపయోగింపబడగలవని నాకొక నమ్మకముకలదు. ఆ నమ్మకమునుబట్టియే ఈపీఠిక రూపమున నాయభినందనమును లోకమునకు తెలుపుచున్నాను. ధన్వంతరి వ్రతానుష్ఠానపరుల కిది యుపయోగించునేని నే నానందించెదను.

వేదమంత్రముల కీ కాలమున పఠనపాఠనప్రచారము తగ్గియుండుటచే వేదోక్తముగ నీవ్రతానుష్ఠాన మొనర్చుట ఇక్కాలమున యజమానుల శ్రేయస్సుకు భంగముకలిగించునని ఆచార్యులుగారితలంపు. స్వరతఃకాని వర్ణతఃకాని హీనముగను మిథ్యగ నుచ్చరింపబడునేని వేదమంత్రములు యజమానులశ్రేయస్సునకు తప్పక భంగముకలిగించునను పూర్ణమగు నమ్మకముచే ఆచార్యులవారీకల్పమును కేవలము పురాణోక్తపద్ధతికి మార్చివేసిరి. ఆచార్యులుగారు ఈ నూతనకల్పప్రచురణమున చేసిన ముఖ్యమగు మార్పు అదియే యైయున్నది. ఈ యుద్దేశమున కనుగుణముగ తమ కల్పమున ఇంతకు పూర్వపుకల్పములకంటె కొంచెము మార్పులుచేసి ఆచార్యులుగారు తమకల్పమును ప్రకటించిరి. ఈ విషయమునకూడ ఆచార్యులుగారి కల్పమును నే నభినందించుచున్నాను. వేదమంత్రములను తక్కురిబిక్కురిగ అపస్వరములతోడను అపశబ్దములతోడను ఉచ్చరించుచు పూజలుచేయుటకంటె పురాణోక్తపద్ధతిని శ్లోకరూపమున జరుపుటయే ఈ కాలపువారికి తగియుండును.

మరియు ఆచార్యులుగారు దేవాలయములకు సంబంధించిన ప్రతిష్ఠాంతములగు కర్మకాండలకును శ్రౌతకర్మకాండలకును సంబంధించిన విధానములను తెలుసుకొని ఆచరణము నుంచుచుండువారగుటచే ఇంతకుమున్ను కల్పములు ప్రచురించినవారికంటె వీరికి పూజాకల్పమున అనుభవము మిన్నగ నుండునని నా యుద్దేశము. దేవాలయప్రతిష్ఠాదికర్మలయందు కలిగియుండు వీరి వైదుష్యము ధన్వంతరికి సంబంధించిన దేవాలయప్రతిష్ఠాదులయందు కూడ గ్రంథరూపమున ప్రచురింపబడి ఆంధ్రులజ్ఞానతేజము వెల్లడింపబడును గాకయని కోరుచున్నాను.

మంత్రములు, యంత్రములు, ఉద్ధారములు సక్రమరూపమున నేర్పడినపుడుగాని ధన్వంతరిఉపాసనలును ధన్వంతరి తపస్సిద్ధులు ఏర్పడి ప్రజాక్షేమమున కుపకరింపజాలవు.

ఈ పూజాకల్పమున లోపము లుండవని నాయుద్దేశముకాదు కాని చాలవరకు లోపములు సవరణ చేయబడియుండునని నాతలంపు. వ్రతకథలకు టీక వ్రాయుట ఉపాధ్యాయులు (యాజకులు) కథాపఠన మొనర్చునపుడు చూపు నడక లివి కొంతవరకు అక్కడక్కడ చూపబడియున్నవి. వ్రతము లాచరించుటయందును వ్రతకథలు చదువుటయందును ఆంధ్రుల కలవాటుగ నేర్పడియుండు కొన్నినడకలు మార్పక ఆరీతిగనే యుంచుటకూడ అవశ్యకముకాగలదు. తక్కిన వ్రతకథలు చదువునపు డేవిధముగ నడక కనుపడునో ఆవిధమగు నడకయే ఈ వ్రతమునకూడ నగుబడుచుండుట వ్రతానుష్ఠానపరుల మనఃప్రవృత్తికిని జనామోదమును వ్యాప్తిని పడయుటకును కారణము కాగలదు. ఈ రీతిగ ఈ వ్రతకల్పమును ధన్వంతరివ్రతానుష్ఠానమును ఆంధ్రదేశమున తక్కిన వ్రతములతో పాటు అభివృద్ధియై వ్యాపించి దానితోపాటు ధన్వంతరిదేవాలయములును ప్రతిష్ఠలును యంత్రములును విరివిగ నేర్పడి ధన్వంతరిమహిమ లోకమున వ్యాపించి దేశక్షేమంకరములై వెలయుగాకయని కోరుచున్నాను.

ఇట్లు,

శ్రీమాన్ కవిరాజ: ప్రతివాదిభయంకర కృష్ణమాచార్యులు,

బెజవాడ.

# శ్రీ ధన్వంతరి స్తోత్రః

శ్లో॥ శ్రీమాన్ కలయతు శశ్వత్ క్షేమం ధన్వంతరి స్సతాం దేవః
కామం సురవరతత్యై కామితదానాయ దుగ్ధవార్ధిభవః.

శ్లో॥ కరధృతదివ్యసుధా వర కలశః
పరిపూర్ణషడ్గుణః శ్రీశః
పరిహృతభక్తక్లేశః
సురుచిరకాంతికాంతవరవేషః.

శ్లో॥ హృతవతి కరధృతకలశే
దితిసుతముఖ్యైః ప్రతిక్షిప్యామాం తేషాం
వ్యతనుత నిర్జరతత్యై
యోషిద్రూపో విభజ్య పీయూషమ్.

శ్లో॥ విశ్రుతవిలసత్కీర్తిః
భక్తానందప్రదానవరమూర్తిః
నిస్తులకరుణామూర్తిః
భాత్యేషః శ్రీహరి స్స్వయం జగతి.

శ్లో॥ అనతసజ్జనపాతా
మానసపర్వగార్తిజాతసంహర్తా
జ్ఞానిప్రవరనిరంతర
గానార్హాత్మీయనిత్యసద్వృత్తః.

శ్లో॥ ఆయుర్వేదార్థసారం నిఖిలమునిజనస్తోమభూత్యై వివృణ్వన్
భూయః పద్మాసనాద్యై రుచిరతరవచసా సంస్తుత స్సేవతాన్నః
ప్రీయాన్ క్షీరాబ్ధిజాయాః సురతరుమణిధేన్వాత్మనైకోభివేద్యో
భక్తేభ్యో దాతు మిష్టం భువి శ మిహ గదాపాయతః సంస్మృతో యః.

శ్లో॥ సుధాకుంభం హస్తే దధ దపరతార్గం సుమనసాం
సహస్రం జహ్వాగ్రే గదహర మథర్వోపనిషదమ్
మణిం శ్రీవత్సాంకం హృది జలనిధేర్యోఽజని పురా
వినిఘ్నన్ విఘ్నం వః సుఖయతు స ధన్వంతరివిభుః.

శ్రీ శ్రీనివాసాయ నమః

శ్రీ మహాధన్వంతరయే నమః.

# శ్రీమద్ధన్వంతరిపూజావ్రతకల్పము

ఓం అయం ముహూర్త స్సుముహూర్తోఽస్తు.

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం । శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనం ధ్యాయే । త్సర్వవిఘ్నోపశాంతయే॥

శ్లో॥ అగజాననపద్మార్కం । గజానన మహర్నిశం ।
అనేకదంతం భక్తానా । మేకదంత ముపాస్మహే॥

శ్లో॥ యశ్శివోనామరూపాభ్యాం । యాదేవీ సర్వమంగళా ।
తయోస్సంస్మరణాత్పుంసాం । సర్వతో జయమంగళం॥

శ్లో॥ తదేవలగ్నం సుదినం తదేవ । తారాబలం చంద్రబలం తదేవ । విద్యాబలం దైవబలం తదేవ । లక్ష్మీపతే తేఽంఘ్రియుగం స్మరామి॥

శ్లో॥ యత్రయోగేశ్వరః......స్తుతే॥

సర్వేభ్యోమహాజనేభ్యోనమః ఆచమ్య॥......సంకల్ప్య॥ పూర్వోక్త ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ యజమానస్య గోత్రనామ సహితస్య సహకుటుంబస్య క్షేమస్థైర్యాయురారోగ్యైశ్వర్యాభివృద్ధ్యర్థం ధర్మార్థకామమోక్ష చతుర్విధ పురుషార్థఫలసిద్ధ్యర్థం యజమానస్య పూర్వ జన్మనిహజన్మని ఏతత్క్షణపర్యంతం కృతమహాపాతకోపపాతకాదిదోష

పరిహారద్వారా ఆధివ్యాధిజరామృత్యురహిత సంపూర్ణసర్వకామ్యార్థ ఫలావాప్త్యర్థం శ్రీధన్వంతరిప్రసాదసిద్ధ్యర్థం దేవదేవ శ్రీపరివారసమేత శ్రీ మహాధన్వంతరిస్వామినముద్దిశ్య శ్రీ స్వామినః ప్రీత్యర్థం పురాణోక్తప్రకారేణ వర్షప్రయుక్త శ్రీధన్వంతరిజయంతీమహావ్రతం కరిష్యే। తదాదౌ శుద్ధ్యర్థం వృద్ధ్యర్థం శాన్త్యర్థ మభ్యుదయార్థంచ శ్రీ మహాజనైస్సహ స్వస్తిపుణ్యాహవాచనం కరిష్యే। ఆదౌ నిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం మహాగణపతిపూజాంకరిష్యే॥ విఘ్నేశ్వరపూజాం పుణ్యాహవాచనంచ విధ్యుక్తప్రకారేణ కుర్యాత్॥ శుభగ్ంశుభమ్.

పునరాచమ్య॥ పూర్వోక్తఏ. ..శుభతిథౌ। శ్రీధన్వంతరిదేవప్రీత్యర్థం పరివారాది దిక్పాలకపూజాంకరిష్యే.

గృహస్యోత్తరదిగ్భాగే భూమ్యాం గోమయేనోపలిప్య। పైష్టిక రంగవల్ల్యాదిభి రలంకృత్య। చతురస్రపీఠం విన్యస్య। తత్పీఠే పంచవర్ణచూర్ణైః అష్టదళపద్మం లిఖిత్వా। తస్యోపరి వస్త్రేణాచ్ఛాద్య। శ్వేతతండులైః పరిమృజ్య। తస్యోపరినవపదంకృత్వా॥ మధ్యేప్రాగాదీశానాంతంచ - నాగవల్లీపత్రాణి క్రమేణ నిధాయ తత్ర మధ్యే దక్షప్రజాపతిం। ప్రాక్పదభాగే ఇంద్రం। ఆగ్నేయ్యాం అశ్వినేయా। యామ్యే అత్రేయం। నైరుత్యాం హారీతం। వారుణ్యాం కాశ్యపం। వాయవ్యాం సూర్యం। కౌబేరే చంద్రం। ఈశానపదభాగే భరద్వాజంచ స్థాపయిత్వా। తదుపరి అష్టదిగ్భాగేషు। ఇంద్రాద్యష్టదిక్పాలకాన్ స్థాపయిత్వా॥ తత్తత్పూజాం కుర్యాత్.

యథా॥మధ్యపదే॥ ఖర్జూరఫలాక్షతక్రముకతామ్రఖండం (ప్రణవేన) నిధాయ,

శ్లో॥ ప్రజాపతే ప్రజానాథ। ప్రజారక్షణదీక్షిత।
ఆవాహయామి త్వాం దక్ష। ప్రసీద వరదోభవ.

మధ్యే దక్షప్రజాపతి మావాహయామి స్థాపయామి పూజయామి.

శ్లో॥ త్రియస్త్రింశత్కోటి దేవ।ప్రభో లోకేత్యభూతిక
కృపయాస్మత్కృతాం పూజాం । గృహాణ స్వర్గనాయక॥
ఇంద్ర మావాహయామి స్థాపయామి పూజయామి॥

శ్లో॥ భక్తానాం రోగహర్తారౌ । దేవానాం భిషజౌ వరౌ
ఆవాహయామ్యశ్వినౌ త్వౌ । లోకరక్షణతత్పరౌ॥
అశ్వినేయావావాహయామి స్థాపయామి పూజయామి॥

శ్లో॥ ఆయురామ్నాయసర్వస్వ । స్యోద్ధర్తః కరుణానిధే ।
ఇహాగత్య మయాదత్తాం । పూజాం స్వీకురు భో మునే॥
ఆత్రేయర్షిమావాహయామి స్థాపయామి పూజయామి॥

శ్లో॥ యశ్శివో నామరూపాభ్యాం । వచసా క్రియయాసహ ।
ఆవాహయామి హారీతం । మునిం లోకావనే రతం॥
హారీత మావాహయామి స్థాపయామి పూజయామి॥

శ్లో॥ దుర్వ్యాపానలసంతప్త । హృదయేషు జనేషు యః।
వవర్షామృతధారాం యః । కాశ్యపం తం సమర్చయే॥
కాశ్యప మావాహయామి స్థాపయామి పూజయామి॥

శ్లో॥ భక్తహృద్గాంధతమస।ఖండనామిత తేజసం ।
సర్వరోగాఘహంతారం । సూర్యంత్వామహమర్చయే॥
సూర్యమావాహయామి స్థాపయామి పూజయామి॥

శ్లో॥ పార్వతీవల్లభశిరో।భూషణం లోకభూషణం।
ఆవాహయామ్యోషధీశం । తాపత్రయహరం పరం॥
చంద్రమావాహయామి స్థాపయామి పూజయామి॥

శ్లో॥ సర్వలోకహితార్థాయ । మహాయుర్వేదసంహితాం।
అనుజగ్రాహ లోకాయ । భరద్వాజ మహం భజే॥
భరద్వాజ మావాహయామి స్థాపయామి పూజయామి॥

తత్ర, అష్టదిక్షు ఇంద్రాదిలోకపాలాన్ । పూర్వోక్తవిధానేన తాంబూలపత్రాదిని నిక్షిప్య యథా ॥

శ్లో॥ ఇన్ద్రోఽమరావతీనాథః । శచీదేవ్యాస్తునాయకః।
వజ్రాయుధశ్చ । ప్రాచీశః యస్యచైరావతోగజః॥
ఇంద్రమావాహయామి స్థాపయామి పూజయామి॥

శ్లో॥ అగ్నిస్తేజోవతీవాసీ । స్వాహాదేవ్యాః ప్రియఃపతిః,
మేషారూఢశ్శక్తిధరః । దిశ్యాగ్నేయ్యాం ప్రతిష్ఠితః॥
అగ్నిమావాహయామి స్థాపయామి పూజయామి॥

శ్లో॥ యమ స్సంయమనీనాథః । శ్యామలాయా మనఃప్రియః,
దండభృన్మహిషారూఢో । దక్షిణస్యాందిశి స్థితః॥
యమమావాహయామి స్థాపయామి పూజయామి॥

శ్లో॥ కృష్ణాంగనాపురం యస్య । దీర్ఘాభార్యానరోహయః,
శస్త్రకుంతో నిర్‌ఋతిశ్చ । నైరృత్యాందిశి సంస్థితః॥
నిరృతిమావాహయామి స్థాపయామి పూజయామి॥

శ్లో॥ పురీశ్రద్ధావతీయస్య।ప్రియాభార్యాచ కాళికా,
నక్రవాహః పాశధరో । వరుణః పశ్చిమేశ్వరః॥
వరుణమావాహయామి స్థాపయామి పూజయామి॥

శ్లో॥ వాయుర్గంధవతీనాథః । కించతస్యాంజనాప్రియా,
సారంగవాహోధ్వజభృత్ । వాయవ్యాందిశివర్తతే॥
వాయుమావాహయామి స్థాపయామి పూజయామి॥

శ్లో॥ కుబేరశ్చాలకాయాస్తు । చిత్రరేఖాప్రియాంగనా
హయోవాహః ఖడ్గధరః । ఉదీచ్యాందిశివర్తతే॥
కుబేరమావాహయామి స్థాపయామి పూజయామి॥

శ్లో॥ యశోవతీశ ఈశానః । సాగభూషస్త్రిలోచనః,
ఈశాన్యాందిశిసంభాతి । వృషారూఢస్త్రిశూలభృత్ ॥
ఈశాన మావాహయామి స్థాపయామి పూజయామి॥

ఆవాహితేభ్యః సపరివారదిక్పాలకేభ్యః అష్టోపచారపూజాంకుర్యాత్ ॥
అష్టోపచారాస్తు:—

శ్లో॥ ఆసనంపాద్యమాచామం । ధూపదీపాఘ్యమేవచ।
హవిఃపానీయమిత్యష్టౌ । ఉపచారాఃప్రకీర్తితాః॥
ఇతిమంటపావాహనం

—♦ అథ ధన్వంతరి పూజ ♦—

ఆచమ్య॥ పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయాం శుభతిథౌ శ్రీమహాధన్వంతరి పూజావ్రతంకరిష్యమాణ స్తదంగభూతాం, పురాణోక్తప్రకారేణయావచ్ఛక్తిధ్యానావాహనాది షోడశోపచార పూజాంకరిష్యే పూర్వోక్తమంటపమధ్యే శుద్ధజలపూరితతామ్రకలశంనిధాయ శ్రీమహాధన్వంతరిం ఉద్దిశ్య, కలశపూజానంతరం, విధివత్కృత్వా॥ కలశాభావే శ్రీధన్వంతరిచ్ఛాయాపటం సంస్థాప్య॥ తద్దేవస్యహృదయస్థానే । ధాం బీజంలిఖిత్వా । తద్బింబే॥ ఆనంతకోటి బ్రహ్మాండ మండలాధారం । నిఖిలసురాసురసంమోహన సుందరాకారం । వివిధమణిఖచితకుండల దేదీప్యమానకపోలయుగళం నిటలతట భాసమానలలిత కస్తూరీతిలకం । వజ్ర వైడూర్య గోమేధిక పుష్యరాగ మరకత మాణిక్య మరీచి నిర్ధూతనిఖిలలోకహార్దాంధతమసం । అధరకిసలయాంత ప్రస్ఫురదధవళతరకుందకుట్మలనిభరదనపాళికోటివిస్ఫురచిత సత్వతత్వం । తత్వమస్యాది మహావాక్యైకసంవేద్యస్వభావమ్ । కౌస్తుభ మణిభూషితవిశాలవక్షఃస్థలం । బాహుచతుష్టయావలంబిత శంఖచక్రసుధాకుంభదివ్యౌషధం। ఆశ్రితభక్తలోకసదారోగ్యప్రముఖనిఖిలసంపత్సంధాన చణచరణతలసమాకలితజలజాకౌపయం దృతపీతకౌశేయవాససం శ్రితార్తి నిర్వాపణార్థానుగృహీత దివ్యావతారం లోకాధారం వరప్రదాతారం ఇతి శ్రీమద్ధన్వంతరిం ధ్యాత్వా॥

## ప్రాణ ప్రతిష్ఠామంత్రః.

అస్యశ్రీ ప్రాణప్రతిష్ఠామంత్రస్య బ్రహ్మవిష్ణుమహేశ్వరాఋషయః ఋగ్యజుస్సామాథర్వణవేదాశ్ఛందాంసి ప్రాణశ్శక్తిః అమృతోద్భవోదేవతా ధాం బీజం శం శక్తిః అయుః కీలకం ప్రాణప్రతిష్ఠార్థేజపేవినియోగః॥ ధ్యానం.—

శ్లో। రక్తాంభోధిస్థపోతోల్లసదరుణసరోజాధిరూఢాకరాబ్జైః ।
పాశం కోదండ మిక్షూద్భవ మళిగణమప్యంకుశం పంచబాణాన్ । బిభ్రాణాఽసృక్కపాలం త్రిణయనసహితా పీనవక్షోరుహాఢ్యా । దేవీ బాలార్కవర్ణాభవతు సుఖకరీప్రాణ శక్తిః పరానః॥

— శ్రీధన్వంతరి ప్రాణా ఇహప్రాణాస్య జీవఇహ జీవస్థిత పృథివ్యాప స్తేజోవాయురాకాశ శబ్దస్పర్శరూపరసగంధ త్వక్చక్షుఃశ్రోత్రజిహ్వాఘ్రాణ వాక్పాణిపాద పాయూపస్థ వచనాదాన గమన విసర్గానంద మనోబుధ్యహంకార ప్రకృతజీవాత్మనీహాగత్య సుఖంచిరంతిష్ఠంతు స్వాహా నమః॥

ఓం నమోభగవతే వాసుదేవాయ ధాన్వంతరాయ, అమృత కలశ హస్తాయ సర్వామయవినాశనాయ, స్వామినేత్రైలోక్యనాథాయ, మహావిష్ణవేనమః ఓం ఆవాహితోభవ వరదోభవ స్థిరాసనంకురు ఇతి ప్రాణ ప్రతిష్ఠాంకృత్వా॥

శ్లో॥ ఆగచ్ఛ దేవదేవేశ । సురాసురసమస్కృత ।
గృహాణాస్మత్కృతాం పూజాం; సర్వాం ధన్వంతరేమమ॥

శ్లో॥ నమామి ధన్వంతరి మాదిదేవం । సురాసురైర్వందితపాద పద్మం।
లోకే జరారుగ్భయమృత్యునాశం । దాతారమీశం వివిధౌషధీనాం॥

॥ శంఖం చక్రముపర్యధశ్చ కరయోర్దివ్యౌషధం దక్షిణే।
వామేనాన్యకరేణ సంభృతసుధాకుంభం జలూకావళిం ।
బిభ్రాణః కరుణాకరశ్శుభకరస్సర్వామయధ్వంసకః
సర్వంమే దురితం ఛినత్తు భగవాన్ధన్వంతరిస్సంతతమ్॥
ఇతి ధ్యాయన్॥

శ్లో॥ సర్వలోకపరిత్రాణ।దీక్షాదీక్షితమవ్యయం
ఆవాహయామి లోకేశం। పీయూషాంచితహస్తకం॥
పరివారసహితశ్రీధన్వంతరిమావాహయామి స్థాపయామి పూజయామి॥

శ్లో॥ సింహాసనం మహద్దివ్యం। హేమరత్నసమన్వితం,
మయా నివేదితం తుభ్యం। గృహాణ జగతః ప్రభో॥
పరివారసహితశ్రీధన్వంతరయే నమః నవరత్నఖచితసింహాసనం సమర్పయామి॥

నారాయణ నమస్తే஽స్తు। సర్వామయవినాశక,
పాద్యం గృహాణ దేవేశ। సర్వౌషధవశేశ్వర॥
పరివారసహితశ్రీధన్వంతరయే నమః పాద్యం సమర్పయామి॥

వ్యక్తావ్యక్తస్వరూపాయ। త్రిలోకేశాయ విష్ణవే,
మయా నివేదితం భక్త్యా। అర్ఘ్యం తే ప్రతిగృహ్యతాం॥
పరివారసహితశ్రీధన్వంతరయే నమః అర్ఘ్యం సమర్పయామి॥

జనార్దనాయ దేవాయ। నమస్తజగదాత్మనే,
నిర్మలజ్ఞానరూపాయ। దత్తమాచమనీయకం॥
పరివారసహితశ్రీధన్వంతరయే నమః ఆచమనం సమర్పయామి॥

గోక్షీరదధిసంయుక్తం । శర్కరామధుసంయుతం,
గృహాణ దేవ సర్వజ్ఞ । సర్వగీర్వాణ సేవిత॥
పరివారసహితశ్రీధన్వంతరయే నమః మధుపర్కం సమర్పయామి॥

నదీనాం చైవ సర్వాసా । మానీతం నిర్మలోదకం,
స్నానం స్వీకురు దేవేశ । మయా దత్తం సురేశ్వర॥
పరివారసహితశ్రీధన్వంతరయే నమః శుద్ధోదకస్నానం సమర్పయామి॥

స్నానం పంచామృతైర్దేవ । గృహాణ పురుషోత్తమ,
అనాథనాథ సర్వజ్ఞ । గీర్వాణప్రణతిప్రియ॥
పరివారసహితశ్రీధన్వంతరయే నమః పంచామృతస్నానం సమర్పయామి॥

వస్త్రయుగ్మం మయా దత్తం । సుసూక్ష్మం స్వర్ణనిర్మితం
దేహాలంకరణం దేవ । గృహీత్వా వరదో భవ॥
పరివారసహిత శ్రీధన్వంతరయేనమః వస్త్రయుగ్మం సమర్పయామి॥

సువర్ణతంతుభిర్యుక్తం । బ్రహ్మణా నిర్మితం పురా
ఆయుష్యవర్ధనం దివ్యం । దదామి కృపయా ప్రభో॥
పరివారసహిత శ్రీధన్వంతరయే నమః యజ్ఞోపవీతం సమర్పయామి॥
యజ్ఞోపవీతార్థం హరిద్రాక్షతాం త్సమర్పయామి॥

కస్తూరికాకర్దమచందనాసికాశ్మీరసంయోజితగంధసారైః।
విలేపనంస్వీకురు దేవదేవ శ్రీ దేవివక్షోజవిలేపనాంగ॥
సపరివార శ్రీధన్వంతరయేనమః, శ్రీగంధాన్ ధారయామి॥

చామంతికావకుళచంపకపాటలాబ్జపున్నాగజాతికరవీర
పుష్పైః! బిల్వప్రవాళతులసీదళమల్లికాభిర్ధన్వంతరే తవ
పదాంబుజమర్చయామి॥
సపరివార శ్రీధన్వంతరయేనమః పుష్పాణ్యర్పయామి॥

పుష్పపూజా ప్రారంభః॥ ఓం కేశవాయనమః ఓం నారాయణాయ నమః ఓం మాధవాయనమః ఓం గోవిందాయనమః ఓం విష్ణవేనమః ఓం మధుసూదనాయనమః ఓం త్రివిక్రమాయనమః ఓం వామనాయనమః ఓం శ్రీధరాయనమః ఓం హృషీకేశాయనమః ఓం పద్మనాభాయనమః ఓం దామోదరాయనమః ఓం ధన్వంతరయేనమః ఓం పీయూషకలశహస్తాయనమః ఓం ఆయుర్వేద స్వరూపాయనమః ఓం సర్వరోగహరాయనమః ఓం త్రిలోకనాథాయనమః ఓం దక్షప్రజాపతయేనమః ఓం ఇంద్రాయ నమః ఓం అశ్విభ్యోనమః ఓం అత్రయేనమః ఓం హారీతాయనమః ఓం కాశ్యపాయనమః ఓం భాస్కరాయనమః ఓం యజ్ఞాంగాయనమః ఓం భారద్వాజాయనమః ఓం ఇంద్రాయనమః ఓం అగ్నయేనమః ఓం యమాయనమః ఓం నిర్ఋతయేనమః ఓం వరుణాయనమః ఓం వాయవే నమః ఓం కుబేరాయనమః ఓం ఈశానాయనమః

## అథాంగ పూజా.

ఓం కేశవాయనమః పాదౌపూజయామి
నారాయణాయనమః జానునీపూజయామి
మాధవాయనమః జంఘేపూజయామి
గోవిందాయనమః ఊరూపూజయామి
విష్ణవేనమః కటింపూజయామి
మధుసూదనాయనమః నాభింపూజయామి
త్రివిక్రమాయనమః పృష్ఠంపూజయామి
వామనాయనమః ఉదరంపూజయామి
శ్రీధరాయనమః కంఠంపూజయామి
హృషీకేశాయనమః హస్తౌపూజయామి
పద్మనాభాయనమః ముఖంపూజయామి
దామోదరాయనమః నేత్రేపూజయామి
ధన్వంతరయేనమః శ్రోత్రేపూజయామి
పీయూషకలశహస్తాయనమః లలాటంపూజయామి
ఆయుర్వేదస్వరూపాయనమః శిరఃపూజయామి
ఓంసర్వరోగహరాయనమః సర్వాణ్యంగాని పూజయామి॥

సపరివార శ్రీ ధన్వంతరయేనమః నానావిధపరిమళ పుష్పాణి సమర్పయామి.

## అథాష్టోత్తరశతనామపూజాప్రారంభః

ఓం ధన్వంతరయేనమః 1
ధర్మధ్వజాయనమః
ధరావల్లభాయనమః
ధీరాయనమః
ధిషణవంద్యాయనమః
ధార్మికాయనమః
ధర్మనియామకాయనమః
ధర్మరూపాయనమః
ధీరోదాత్తగుణోజ్జ్వలాయనమః
ధర్మవిదేనమః 10
ధరాధరధారిణేనమః
ధాత్రేనమః
ధాతృగర్వభిదేనమః
ధాత్రీడితాయనమః
ధారాధరరూపాయనమః
ధార్మికప్రియాయనమః
ధార్మికవంద్యాయనమః
ధార్మికజనధ్యాతాయనమః
ధనదాదిసమర్చితాయనమః
ధనంజయరూపాయనమః 20
ధనంజయవంద్యాయనమః
ధనంజయసారథయేనమః
ధిషణరూపాయనమః
ధిషణాసేవ్యాయనమః
ధిషణాదాయకాయనమః
ధార్మికశిఖామణయేనమః
ధీప్రదాయనమః
ధ్యానగమ్యాయనమః

ఓం ధ్యానధ్యాత్రేనమః
ధ్యాతృధ్యేయపదాంబుజాయనమః 30
ధీరసంపూజ్యాయనమః
ధీరసమర్చితాయనమః
ధీరరత్నాయనమః
ధురంధరాయనమః
ధీప్రదాయనమః
దోషఘ్నాయనమః
దివ్యరూపాయనమః
ధీరశిఖామణయేనమః
దూరాధరాయనమః
ధూపధూపితవిగ్రహాయనమః 40
ధూపగీపాదిపూజాప్రియాయనమః
ధూమాదిమార్గదర్శకాయనమః
దుష్టాయనమః
దుష్టద్యుమ్నాయనమః
దుష్టద్యుమ్నస్తుతాయనమః
ధేనుకాసురసూదనాయనమః
ధేనుప్రజరక్షకాయనమః
ధేనుకాసురవరప్రదాయనమః
ధైర్యాయనమః
ధైర్యవతానుగ్రహయేనమః 50
ధైర్యప్రద్యాయకాయనమః
దోగ్ధ్రేనమః
ధావ్యాయనమః
ధామ్యేడితాయనమః
ధామ్యాదిమునిస్తుతాయనమః

ఓం ధాన్యవరప్రదాయనమః
ధర్మసేతవేనమః
ధర్మమార్గప్రవర్తకాయనమః
ధర్మమార్గవిఘ్నకృత్సూదనాయ||
ధర్మరాజాయనమః. 60
ధర్మపరవంద్యాయనమః
ధామత్రయమందిరాయనమః
ధనుర్వాతాదిరోగఘ్నాయనమః
ధృతిసర్వాద్యబృందాయనమః
ధారణారూపాయనమః
ధారణామార్గదర్శకాయనమః
ధ్యానమార్గతత్పరాయనమః
ధ్యానమార్గైకగమ్యాయనమః
ధ్యానమాత్రసులభాయనమః
ధ్యాతృపా[illegible]యనమః 70
ధ్యాతృతాపత్రయ[illegible]నమః
ధనధాన్యప్రదాయః
ధనధాన్యమత్తజనసూదనాయనమః
ధూమకేతువరప్రదాయనమః
ధర్మాధ్యక్షాయనమః
ధేనురక్షాధరణాయనమః
ధరణీరక్షణధురీణాయనమః
ధరణీభారాపహారకాయనమః
ధీరసంరక్షణాయనమః
ధర్మాభివృద్ధికర్త్రేనమః 80
ధర్మగోప్త్రేనమః
ధర్మకర్త్రేనమః
ధర్మబంధవేనమః
ధర్మహేతవేనమః

ఓం ధార్మికపరిజనరక్షాధురీణాయనమః
ధనంజయసాహాయ్యకృతేనమః
ధనంజయస్తోత్రపాత్రాయనమః
ధనంజయగర్వహర్త్రేనమః 90
ధనంజయస్తుతిహర్షితాయనమః
ధనంజయవియోగక్షిన్నాయనమః
ధనంజయగీతోపదేశకృతేనమః
ధర్మాధర్మవిచారపరాయణాయ [నమః
ధర్మసాక్షిణేనమః
ధర్మనియామకాయనమః
ధర్మధురంధరాయనమః
ధనద[illegible]జనదూరగాయనమః
ధర్మపాలకాయనమః
ధర్మమార్గోపదేశకృద్వంద్యాయ
నమః 100
ధర్మతనయవంద్యాయనమః
ధర్మరూపవిదురవంద్యాయనమః
ధర్మతన[illegible]స్తుత్యాయనమః
[illegible]త్రాయనమః
ధర్మతనయసంసే[illegible]యనమః
ధర్మతనయమాన్యాయనమః
ధారామృతహస్తాయనమః
శ్రీధన్వంతరయేనమః 108
సపరివార శ్రీధన్వంతరయేనమః
అష్టోత్తర శతనామపూజాంసమ
ర్పయామి||

శ్రీఖండ లాక్షారసకుందదివ్య । కర్పూర కాలాగరుచంద
నాని ! ఖచోరకకృష్ణాగరుదేవదారు । మాంచీయుతాన్సేనజ
ప్తాతికాశ్చ॥

పరివార సహిత శ్రీధన్వంతరయేనమః ధూపమాఘ్రాపయామి॥

సూర్యాంశుకోటిప్రభ వాసుదేవ దీపావళిర్గోఘృతవర్తియుక్తా
స్వమాయయాంధీకృతసర్వలోక । జ్ఞానప్రదీపంకురుతే
నమోస్తు॥

సపరివార శ్రీధన్వంతరయేనమః దీపందర్శయామి.

మందాకిన్యాస్తుయద్వారి । సర్వపాపహరం శుభం,
తదిదం కల్పితం దేవ । సమ్యగాచమనీయకం॥

పరివారసహిత శ్రీధన్వంతరయేనమః ధూపదీపానంతరం శుద్ధ ఆచ
మనీయం సమర్పయామి.

గోధూమచూర్ణం ద్విప్రస్థం । క్షీరం తద్ద్విగుణం స్మృతం
చతుర్గుణేఘృతేక్షిప్త్వా । శర్కరాంచైవ షడ్గుణం,
ప్రక్షిప్యసమ్యక్పక్త్వ్యం । తస్మిన్నేతాని ప్రక్షిపేత్,
కుంకుమం ఘనసారంచ । ఏలాంద్రాక్షాంఫలానిచ,
త్రిసుగంధంచ సంచూర్ణ్య । సమ్యక్సమ్మేళయేత్తతః॥

పరివారసహిత శ్రీ ధన్వంతరయేనమః గోధూమపిష్టక్షీరఘృతద్రాక్షా
ఫలఘనసార శర్కరాసంమిశ్ర ఉపహారాదికం నివేదయామి.

నివేదనసమయే నిమీలితలోచనః మనసా ధ్యాయన్ ప్రాణాదిపం
చాహుతీన్ సమర్పణపూర్వకం నివేదయేత్.

సపరివార శ్రీధన్వంతరయేనమః ఉత్తరాపోశనం హస్తప్రక్షాళనం పాదప్రక్షా
ళనం శుద్ధ ఆచమనీయం సమర్పయామి.

శ్లో॥ ఏలావంగకర్పూర । కుంకుమాది సమన్వితం,
తాంబూలీదళ సంయుక్తం। తాంబూలం ప్రతిగృహ్యతాం॥
సపరివార శ్రీధన్వంతరయేనమః తాంబూలం సమర్పయామి॥
తాంబూలచర్వణానంతరం శుద్ధఆచమనీయం సమర్పయామి॥

శ్లో॥ నీరాజనం గృహాణేదం । ఘనకర్పూరసంయుతం,
తేజోరాశిమయం దత్తం । గృహాణ త్వం సురేశ్వర॥

శ్లో॥ మంగళం సాగరోత్థాయ । పీయూష కలశాయచ,
ఆయుర్వేదస్వరూపాయ । వేదవేద్యాయ మంగళం॥
పరివారసహిత శ్రీధన్వంతరయేనమః కర్పూరనీరాజనం దర్శయామి।
నీరాజనానంతరం శుద్ధ ఆచమనీయం సమర్పయామి॥

శ్లో॥ మల్లికాజాతి కుసుమై । శ్చంపకై స్తులసీదళైః,
పుష్పాంజలింప్రదాస్యామి । లక్ష్మ్యాసహజగత్ప్రభో॥
పరివారసహిత శ్రీధన్వంతరయేనమః మంత్రపుష్పం సమర్పయామి॥

శ్లో॥ బుద్ధిశక్తింతథోత్సాహం । ఆయురారోగ్య మేవచ,
దేహాంతే తవసాయుజ్యం । దేహిధన్వంతరేనమః॥
నమస్తే భగవన్సూర్యో । నమస్తే ధరణీశ్వర,
నమస్తే దేవదేవేశ । నమస్తేభక్తవత్సల॥
ప్రదక్షిణం కరిష్యామి । సర్వవ్యాధినివారణం,
త్రాహిధన్వంతరే పాహి । రోగానీకైక కారణాత్॥
పరివారసహిత శ్రీధన్వంతరయేనమః ఆత్మప్రదక్షిణనమస్కారాన్ త్సమర్పయామి ఛత్రం ధారయామి చామరంవీజయామి దర్పణం దర్శయామి సకలశ్రేయోదాయకం శ్రీధన్వంతరిసమ్ముఖే ఆయుర్వేద సకల పురాణేతిహాసమీమాంసాస్తోత్రశ్రవణ జపాశ్చ నృత్యగీత వివిధవాద్య వినోదాదీన్యస్య విజ్ఞాపనం కుర్యాదితి రాజోపచారాన్ త్సమర్పయామి॥

అనంతరం కథాశ్రవణం కృత్వా॥

కథా శ్రవణానంతరం పునఃపూజాం కుర్యాత్ ॥ఆచమ్య॥ పూర్వోక్త......శుభతిథౌ సపరివార శ్రీధన్వంతరిస్వామినేనమః ఆసన పాద్యాచమన గంధపుష్పధూప దీపనైవేద్యాద్యష్టోపచారాన్ కరిష్యామీతి సంకల్ప్య॥

శ్లో॥ అన్నం చతుర్విధం స్వాదు । రసైష్షడ్భిస్సమన్వితం,
భక్ష్యభోజ్యసమాయుక్తం । నైవేద్యం ప్రతిగృహ్యతాం॥

పరివారసహిత శ్రీధన్వంతరిస్వామినేనమః, భక్ష్య, భోజ్యలేహ్య చోష్యపానీయాన్నాదికం, నివేదయామి.

మధ్యేమధ్యేపానీయం ఉత్తరాపోశనం, హస్తప్రక్షాళనం, పాద ప్రక్షాళనం, శుద్ధ ఆచమనీయం సమర్పయామి.

—తాంబూలాది రాజోపచారాన్ పూర్వవద్దద్యాత్॥

శ్లో॥ అపరాధసహస్రాణి । క్రియంతేహర్నిశంమయా,
దాసోయమితి మాంమత్వా । క్షమస్వపురుషోత్తమ,
రూపందేహిజయం దేహి । యశోదేహి ద్విషోజహి,
పుత్రాన్ దేహి ధనందేహి । సర్వకామాంశ్చ దేహి మే॥

ఇతి పునఃపునః ప్రార్థయేత్॥

శ్లో॥ యస్యస్మృత్యాచనామోక్త్యా । తపఃపూజాక్రియాదిషు,
న్యూనం సంపూర్ణతాంయాతి । సద్యోవందేతమచ్యుతం,
మంత్రహీనం క్రియాహీనం । భక్తిహీనం జనార్దన,
యత్పూజితం మయాదేవ । పరిపూర్ణంతదస్తుతే॥

అనయా ధ్యానావాహనాది షోడశోపచార పూజయా ధన్వంతరిస్వాత్మకః, పరివారసమేత శ్రీధన్వంతరి సుప్రీతస్సుప్రసన్నో వరదో భవతు, ఆచరితవ్రతోక్త సంపూర్ణ సకలఫలావాప్తిరస్తు । ఏతత్ఫలం శ్రీధన్వంతర్యర్పణమస్తు॥ సర్వేషాం జనానాం తీర్థప్రసాదం భక్త్యాదద్యాత్।

బ్రాహ్మణానామాశీర్వాదం గృహీత్వా, బంధుహిత సుహృద్భక్తజనాన్ భోజయేదితి విశేషః॥

ఇతి శ్రీధన్వంతరివ్రత పూజాకల్ప స్సమాప్తః.

## అథ ధన్వంతరి వ్రతకథా ప్రారంభః.

శ్లో॥ శంఖచక్రసుధాకుంభ। దివ్యౌషధ కరత్కరం,
భక్తాభీష్ట ప్రదాతారం। ధన్వంతరి ముపాస్మహే॥

తా॥ శంఖము, చక్రము, అమృతకలశము, దివ్యౌషధము, అనువానిని చతుర్భుజములయందు ధరించినట్టివాడును్నూ సకలభక్తుల కోరికల నీడేర్పునట్టియు పరాత్పరుండగు ధన్వంతరి నుపాసించుచున్నాను.

## అథ ప్రథమోధ్యాయః.

శ్లో॥ కదాచిన్మునయస్సర్వే। శౌనకాద్యామహౌజసః,
సర్వశాస్త్రార్థవేత్తార। మప్రాక్షుర్ముదితాత్మనః. 1

తా॥ ఒకానొక సమయమునందు తేజస్సంపన్నులైనటువంటి శౌనకాది మహాఋషులు యావన్మందిన్నీ సర్వశాస్త్రార్థ సారములను తెలుసుకొనియుండు సూతమహర్షి నుద్దేశించి సంతోషచిత్తులై ఈక్రిందిగా ప్రశ్నించినవారైరి.

శ్లో॥ సూతసూత మహాభాగ। సర్వవేదార్థకోవిద
శ్రీమద్ధన్వంతరేః పూజా।విధిర్విస్తరత స్త్వయా॥ 2

తా॥ సమస్త వేదార్థములను బాగుగా నెరింగియుండు శ్రీసూత మహర్షీ! మీవలన యిపుడు శ్రీధన్వంతరిపూజావిధివిధానములను విస్తారముగా వినియున్నాము.

శ్లో॥ కథితః శృణ్వతాం తృప్తి। ర్నైవజాతా మహాముసే,
తన్మాత్తత్తస్యమాహాత్మ్యం। విస్తరాద్వక్తుమర్హసి॥ 3

తా॥ శ్రీధన్వంతరి వ్రతకథా మాహాత్మ్యమును వినని హేతువుచేత మామనస్సునకు సంతృప్తి కలుగకున్నది గాన కటాక్షించి తన్మాహాత్మ్యమును

సవిస్తరముగా ఆనతీయవేయని శౌనకాది మహామునులు శ్రీ సూతమహాను భావుని ప్రార్థించినవారైరి.

సూత ఉవాచ:—

శ్లో॥ కృతేత్వస్థిగతాః ప్రాణాః। త్రేతాయాం మాంసమాశ్రితాః,
ద్వాపరేచర్మసంస్థాశ్చ । కలావన్నగతాన్నృణాం॥ 4

తా॥ మనుష్యుల ప్రాణంబులు, కృతయుగమునందు ఎముకలయందును, త్రేతాయుగమందు మాంసంబునందును. ద్వాపరయుగంబున చర్మంబునందును, కలియుగంబునందు, అన్నమును ఆశ్రయించియుండును గావున,

శ్లో॥ కృఛ్రచాంద్రాయణాద్యైశ్చ । తపోభిః శ్రీహరేః కృపాం,
లబ్ధ్వాసుఖానవాప్నుంచ । నావకాశో యత స్తతః॥ 5

తా॥ కృఛ్రచాంద్రాయణాది వ్రతములుగాని తపస్సులుగాని చేసి శ్రీ భగవత్కటాక్షమునొంది సుఖించుట కలియుగమునందు కష్టసాధ్యముగా వుంటూవున్నది సుమా !!

శ్లో॥ కలౌధన్వంతరేః పూజా । విష్ణునాకథితాపురా,
తతఃప్రాప్తసుఖానాంతు । చరితం నారదాయతు॥ 6

తా॥ మీరు నన్ను కోరినట్లె పూర్వకాలమందు శ్రీ మహావిష్ణు మూర్తిని నారదుడు ప్రార్థింపగా కరుణానిధి వాత్సల్యముగలవాడై, కలియుగమున నందరికిని సులభసాధ్యమైనటువంటి శ్రీ ధన్వంతరివ్రతమును నొకదాని నుపదేశించెను.

శ్లో॥ యథోపదిష్టంహరిణా। కథ్యతేపి యథాశ్రుతం॥ 7

తా॥ శ్రీమన్నారాయణమూర్తివారివలన నారదమహాఋషి యుపదేశమొందినరీతిగా మీకు నేను యిప్పుడు విస్తరించి చెప్పుచున్నాను. సావధానముగా వినుండని సూతుండు శౌనకాదులతో చెప్పసాగాడాయెను.

శ్లో॥ పూర్వసంచితపాపౌఘై । రాధివ్యాధియుతా నరాః,
దేవా నాగాశ్చ విధివ । ద్ధన్వంతరిసమర్చనాం,
కృత్వా దుఃఖై ర్విముక్తా వై । ఇహాముత్ర సుఖం విదుః॥

తా॥ దేవతలున్ను, నాగులున్ను, మనుష్యులున్ను, తాము పూర్వ జన్మములయందు ఆర్జించినట్టి పాపాదిరోగ సర్వదుఃఖముల చే బీడింపబడుచున్నవారలై తన్నివృత్తికొరకు విధి ననుసరించి శ్రీ ధన్వంతరిపూజ నాచరించినవెంటనే తద్దుఃఖవిముక్తినొంది ఇహమందు సర్వసౌఖ్యముల ననుభవించి పరమందు పరమానందమును పొందగలవారైరి.

శ్లో॥ కార్తికే కృష్ణపక్షే తు । త్రయోదశ్యాం గురోర్దినే,
హస్తానక్షత్రసంయుక్తే । యామే ప్రథమికే నిశి॥
ధన్వంతర్యాఖ్యయా చాహం । ధనం సముద్రోదధేః,
ఆనీతో౽యత స్తస్మాత్ । నా తిథిస్సర్వకామదా,
ధనత్రయోదశీ చేతి । భూమౌ ప్రఖ్యాతిమేష్యతి,
తస్మిన్ దినే కృత్వా పూజా । సర్వాన్యక్షయతాం వ్రజేత్॥

తా॥ కార్తీకమాస బహుళపక్ష త్రయోదశీతిథిని గురువారంబున హస్తానక్షత్రమున రాత్రి ప్రథమయామమున, [illegible] నామంబుతో దాచఁడినధనంబునుబోలి సముద్రమునుండి భూమియం దవతరించితిని. అప్పటినుండి ధనత్రయోదశియనుపేరు విరాజిల్లుచుండె గాన నా పుణ్యదినంబునందు మానవాదులు నాపూజ నొనర్చిరేని సమస్త కోరికల నీడేర్చుగలుగును. ఆ సుదినమున శ్రీ మహాధన్వంతరివ్రతమును భక్తితో నాచరించిన అక్షయమగును.

శ్లో॥ నోచేద్యదా కదా వాపి । కర్తుం యుజ్యేత భూతలే॥

తా॥ అట్టి ముఖ్యకాలమున వ్రతంబు నాచరింపలేనివారు తమకు సంకల్పముకల్గిన ఇష్టమాస నక్షత్ర తిథివారంబుల నెప్పుడైనను యేకాలమునైనను స్థిరమనస్కులై ధన్వంతరి నారాధించవచ్చును. ఇట్లుపూజించు వారలకు సర్వరోగతాపములు హరించునని శ్రియఃపతి నారదునకు జెప్పిన

విధమంతయు యా నారదునివలన నేను తెలుసుకొనిన చొప్పున మీకుం దెలియజెప్పితినని సూతుడు శౌనకాదులతో జెప్పినవాడాయెను.

శ్లో॥ గృహస్యోత్తరదిగ్భాగే । గోమయేనోపలిప్య చ,
రంగవల్ల్యాద్యలంకృత్య । మంటపం తత్ర కారయేత్,
శ్రీమద్ధన్వంతరేశ్చక్రే । దేవమావాహ్య భక్తితః,
కల్పోక్తేన ప్రకారేణ । పూజయేత్ప్రయతో నిశి॥

తా॥ గృహమునం దుత్తరభాగమున గోమయముచే నలికి బియ్యపు పిండిచే చిత్రవిచిత్రమైన ముగ్గులు పెట్టి యందు దివ్యమంటపనిర్మాణము చేసి యాపై శ్రీమహాధన్వంతరిదేవుని సపరివారముగా అత్యంతభక్తితో నావాహనముచేసి కల్పోక్తవిధిప్రకారము శక్త్యనుగుణముగా షోడశోపచారములచే విశేషపూజలను రాత్రియందు చేయవలయును.

శ్లో॥ దేవతాయతనే నద్యాం । తీరే బ్రాహ్మణసన్నిధౌ,
బంధుభిర్బ్రాహ్మణైస్సార్ధం । యథాశక్తి ప్రపూజయేత్॥

తా॥ ఈ వ్రతపూజనము దేవాలయమందైనను మహానదీసమీపమందైనను బ్రహ్మవేత్తలుండు స్థలమునందైనను, బంధువులతోను, బ్రాహ్మణుల సహితముగా యథాశక్తితో దేవదేవుని పూజించుట శ్రేయోదాయకము.

శ్లో॥ గోధూమచూర్ణం ద్విప్రస్థం । క్షీరం తద్ద్విగుణం స్మృతం,
చతుర్గుణే ఘృతే క్షిప్త్వా । శర్కరాం చైవ షడ్గుణాం,
ప్రక్షిప్య సమ్యక్పక్త్వాం । తస్మిన్నేతాని ప్రక్షిపేత్,
కుంకుమం ఘనసారం చ । ఏలాం ద్రాక్షాం ఫలాని చ,
త్రిసుగంధం చ సంచూర్ణ్య । సమ్యక్సమ్మిశ్రయేత్తతః,
నైవేద్యమేతద్దేవాయ । సన్నివేద్య తతః స్వయం,
ఇతరే బాంధవాశ్చాపి । స్వీకుర్వంతు ప్రసాదకం॥

తా॥ రెండు ప్రస్థములు (అనగా) వాగ్భటమానప్రతూకము ననుసరించి ఒక ప్రస్థమునకు ౬౪ తులములు చొప్పున రెండుప్రస్థములకు ౧౨౮ తులముల గోధుమపిండిన్నీ, ఇంతకు రెట్టి(అనగా) నాల్గు ప్రస్థములు ఆవుపాలును, ఆవునెయ్యి ఎనిమిది ప్రస్థములును, పన్నెండు ప్రస్థములు పంచదారయు చేర్చి సమ్యక్పక్వముగా పాకముజేసి యందు కుంకుమపువ్వు, పచ్చకర్పూరము, ఏలకులు, ద్రాక్షపండ్లు, ఖర్జూరపండ్లు, వీట్లను ఒక్కొక్క పలము అనగా తు ౪ లు చొప్పునను లవంగములు దాల్చినచెక్క జాపత్రి వీనిని చూర్ణించి యొక్కొక్క పలము చొప్పున పాకమునందు చేర్చి చక్కగా కలియగలిపి సిద్ధము చేయబడిన ప్రసాదమును పరివారసహితుడైన శ్రీ ధన్వంతరివారికి నివేదనముంజేసి తత్పూజాంతమున తానును బంధుసహితుడై భక్తజనులందరును భగవత్ప్రసాదము, తీర్థము, భక్తియుతులరై స్వీకరించవలెను.

శ్లో॥ ఏవం కృత్వా పుష్పవేణీ । మృతం పతి మవాప చ,
శృత్వా విష్ణోర్దేవమాని । ర్యదువాచ బ్రవీమి వః॥

తా॥ ఇట్లు శ్రీ ధన్వంతరిపూజను గావించినంతమాత్రముచే, పూజామాహాత్మ్యమువలన, సర్పదష్టుడై మృతిజెందిన తనభర్తను సజీవునిగజేసిన పుష్పవేణియను కన్యకామణియొక్క ఇతిహాసకథను, పూర్వమందు శ్రీమన్నారాయణుండు నారదమునికి బోధించె, నాతెరంగంతయు మీకు వినిపించెదనని శౌనకాదులతో సూతుం డిట్లనియె.

ఇతి శ్రీ బ్రహ్మాండపురాణే ధన్వంతరిపూజావ్రతకథాయాం ప్రథమోధ్యాయః.

## అథ ద్వితీయోధ్యాయః

నారదః:-

శ్లో॥ కస్య పుత్రీ పుష్పవేణీ । కస్తద్భర్తా మృతః కథం,
ఏతద్విస్తరతో బ్రూయాః । శ్రోతుం కౌతూహలం హి మే॥

తా॥ ఓమహానుభావా! శ్రీవిష్ణుమూర్తీ, పుష్పవేణి యెవరికూమార్తె? ఆమెభర్తయెవరు?, ఆభర్త ఏకారణముచే మృతుడాయెనో యా వృత్తాంతమును సవిస్తరముగ సెలవీయవలసినదిగా ప్రార్థించెను.

శ్రీ భగవానువాచ:-

శ్లో॥ రాజా పుష్పరథోనామ । ప్రజాపాలనతత్పరః,
పుణ్యమూర్తిః పుణ్యశీలో । పుణ్యకర్మసు నిష్ఠితః॥

తా॥ ప్రజాపరిపాలనమున సమర్థుండును నెల్లవేళలయందు పుణ్యకార్యములం జేయువాడును పుణ్యమూర్తియు విధ్యుక్తాచారసంపన్నుడునగు పుష్పరథుడను పేరుగల ఒకరాజు కలడు.

శ్లో॥ తద్భార్యాపుష్పసారాఖ్యా । పతిభక్తిపరాయణా,
తౌపశ్చిమే వయస్యేకాం । పుత్రికాం పుష్పవేణికాం॥

తా॥ ఆరాజునకు పతివ్రతయగు పుష్పసారయను పేరుగల భార్య కలదు. ఈ యిరువురకు వృద్ధదశయందు ఒక పుత్రికాగత్నము కలిగె, నామెకు పుష్పవేణియని నామకరణం బొనర్చిరి.

శ్లో॥ ప్రాపతుస్సాపి కాలేన । సర్వవిద్యావిశారదా,
రూపయౌవనసంపన్నా । వివాహప్రాయమాస్థితా॥

తా॥ ఆపుష్పవేణి దినదినప్రవర్ధమానయై రూపలావణ్యాది సౌందర్యములచే నొప్పుచు సమస్తవిద్యలను నభ్యసించి క్రమముగ వివాహప్రాయముం దాల్చినదాయెను.

శ్లో॥ తాం విలోక్యాంకమారోప్య । చికీర్షాం జ్ఞాపయన్ పురః,
నానారాజకుమారాణాం । ప్రతిరూపాణ్యదర్శయత్॥

తా॥ వివాహవయస్కురాలైన తన కుమార్తెను చూచి యా పుష్పరథుడు కడుప్రేమతో పుష్పవేణిని తన తొడయందు కూర్చుండబెట్టుకొనినవాడై, అమ్మా ఇందు ఇష్టుడైన వరుని కోరుకొమ్మని సమస్తమైన రాజకుమారులయొక్క ప్రతిబింబములుగల ఛాయాపటములను చూపించినవాడాయెను.

శ్లో॥ క్రమశస్తాని సంవీక్ష్య । తత్రైకం కామసుందరం,
సుప్రకాశం సుప్రసన్నం । మాళవాధిప తేస్సుతం,

నిర్నిమేషదృశాదృష్ట్వా స్వీయభావం నివేదయత్ ॥

తా॥ ఆ రాజకుమారులప్రతిబింబపటముల పుష్పవేణీ క్రమక్రమముగా వీక్షింపుచు ఆయా వృత్తాంతముల నాలకించి ఇందు ఒకనిపటమును ఱెప్పవేయక చూచి యామె తనకు తగినపతి యితడని నిశ్చయించుకొని మాళవదేశాధీశ్వరునికుమారుడగు సుప్రకాశునిచరిత్రమంతయును విని తన మనోరథమును తండ్రికి తెలియజెప్పినదాయెను.

శ్లో॥ జ్ఞాత్వా పుష్పరథో రాజా । సమాహూయ పురోహితం,
లిఖిత్వా శుభలేఖాం తన్మాళవేశాయ ప్రాహిణోత్ ॥

తా॥ పుష్పరథుడను రాజు తనకుమార్తెయొక్క సంకల్పమును వినిన తోడనే పురోహితుని రావించి శుభలేఖను వ్రాయించి దానిని ఆ మాళవదేశాధీశ్వరునికడకు పంపినవాడాయె.

శ్లో॥ మాళవేశోపి తల్లేఖాం । సుప్రకాశాయ ధీమతే,
దదౌ స్వోచ్ఛప్రజానాథ।సంబంధముదితాంతరః॥

తా॥ మాళవేశ్వరుడు తన కుమారునకు పిల్లనిచ్చెదనని తనకంటె గొప్పవాడగు పుష్పరథుడు వ్రాసిన శుభలేఖను చూచి పరమానందభరితుడై యాలేఖను దన కుమారున కిచ్చెను.

శ్లో॥ ముక్తస్సాంసారికాద్బంధా । ద్దేవసేవాపరాయణః,
శ్రీహరేః కరుణాలిప్సు।స్సుప్రకాశో ప్యవోచత॥

తా॥ సుప్రకాశుడు ఆ లేఖను చూచినవాడై, సంసారసుఖ మనుభవించుటయందు లేశమాత్రము కోరిక లేక శ్రీహరిని నారాధించి ముక్తిం గాంచు కోరికకలవాడై తండ్రితో నిట్లు చెప్పెను.

శ్లో॥ అసారభూతే సంసారే।సుఖలేశోపి నో గురో,
సర్వానర్థప్రదం పాణి।పీడనం నోత్సహేతతః॥

తా॥ తండ్రీ!సంసారమునందు ఎంతమాత్రము సారములేదు. సంసారబంధము సర్వానర్థములకు మూలహేతువు, వదలుటకు శక్యముకానిదియు

సుఖమనునది లేశమైనను లేనిదియునగు వివాహబంధభారమును నేను ధరింప జాలను.

శ్లో॥ అనుజానీహి మాం శీఘ్రం । తపోవనగతింప్రతి,
అతిక్రాంతత్వదాదేశం । క్షమస్వ కృపయా గురో॥

తా॥ ఓ తండ్రీ, వెంటనే తపోవనమునకు వెళ్ళుటకు నాకు సెలవొసంగవలసినదని ప్రార్థించె. తండ్రియు, ననేకవిధములుగ గృహస్థాశ్రమ ధర్మములను బోధించెనుగాని, సుప్రకాశుని మనసు తిరుగలేదు. తమయాజ్ఞను మీరిన నన్ను క్షమింపుమా యని తండ్రియైన మాళవేశ్వరుని వేడుకొనుచు నున్నవాడాయెను.

శ్లో॥ ఇత్యాకర్ణ్య వచస్తస్య । రాజాపుష్పరథస్స్వయం,
బహుధాబోధయామాస । సాంసారికసుఖంప్రతి॥

తా॥ సుప్రకాశుని వైరాగ్యసంబంధమగు వచనములను విని పుష్పరథుడను రాజు స్వయముగా వచ్చి అనేకములగు సాంసారికధర్మములను బోధించినను సుప్రకాశుడు మనస్సును వదలలేదు.

శ్లో॥ అనివృత్తమనా శ్శీఘ్రం । సుప్రకాశోదృఢవ్రతః,
సునీతినా వయస్యేన । జగామ గహనం వనం॥

తా॥ ఎన్నివిధముల బోధించినను దృఢతపోవ్రతస్థుడైన సుప్రకాశుని వదలి పుష్పరథుడు తన యాస్థానమునకు వెళ్లెను. తత్క్షణమే సునీతియను స్నేహితునితో కలిసి సుప్రకాశుడు తపోవనమును గూర్చి వెళ్ళినవాడాయెను.

శ్లో॥ సర్వాణ్యాపి చ శాస్త్రాణి । వేదాన్వేదశిరాంసిచ,
ధర్మశాస్త్రచయంలోకే । జ్ఞాతవ్యం శాస్త్రవిస్తరం,
కస్యచిన్మునివర్యస్య । శుశ్రూషాం తు చక్ర యుతః॥

తా॥ అట్లు మహారణ్యమును ప్రవేశించి, నియమితచిత్తులై యొకముని శ్రేష్ఠునకు శుశ్రూషలం జేయుచు నాశ్రయించిన సుప్రకాశ సునీతులయం

దనుగ్రహముగల యా గురువరేణ్యులవద్దను లోకములయందు తెలిసికొన వలసిన వేదవేదాంగ ధర్మశాస్త్రాదివిద్యలనెల్ల నభ్యసించినవారైరి.

శ్లో॥ వివేద ప్రియశిష్యంతం । సునీతిం సుప్రకాశకం,
అభ్యస్తాని సమస్తాని । శాస్త్రాణి చ మహామతిః॥

తా॥ అంతట గురువు తనప్రియశిష్యులైనటువంటి సుప్రకాశ సునీతులను చూచి, కుమారులారా,. అభ్యసించవలసిన గొప్పవగు సమస్త శాస్త్రములు మావలన అభ్యసించబడినవిగదా.

శ్లో॥ గత్వాస్వనగరీం సాధ్వీం । పాణిం గృహ్యాయథాసుఖం,
గచ్ఛేతామిహిలోకాన్ భోగాన్ । కాలే స్వర్గసుఖం తథా॥

తా॥ ఓ కుమారులారా యికను మీనగరమునుగూర్చి వెళ్ళి పతివ్రత యగు స్త్రీరత్నమును పాణిగ్రహణ మొనర్చుకొని, రాజ్యభోగముల ననుభవించి అంతమున స్వర్గసుఖముల ననుభవింపుడని, మునివర్యుడాజ్ఞయిచ్చిన వాడాయెను.

శ్లో॥ ఏవం సద్గురుణాజ్ఞప్తౌ । స్వపురాగమనోద్యతౌ,
సంధ్యాకాలే సమాసన్నే । నదీతీర ముపాసతః॥

తా॥ ఆప్రకార మా గురువాక్యము శిరసావహించి యారాజకుమారు లిరువురును బయలుదేరి, తమపురమున కభిముఖులై చనుచెంచుచుండ సాయంసంధ్యాకాలమగుటంజేసి యొక నదీతీరమున నివసించి ఆరాత్రి గడపి పోవ నుద్దేశించుకొనినవారైరి.

శ్లో॥ నదీశాంతం సుప్రకాశం । సుప్తం రక్షన్ ధనుర్ధరః,
సునీతిజాగరూకస్సన్ । తస్థౌ తస్మిన్ మహావనే॥

తా॥ వీరిలో సుప్రకాశు డనుకుమారుడలసటచే మార్గాయాసమున కడు డస్సినవాడై త్వరలోనే పరుండి నిద్రించెను. సునీతియను కొమరుండు ధనుస్సును ధరించినవాడై యాయరణ్యప్రాంతమందు దనమిత్రునకెట్టి యాపదలు వాటిల్లకుండ జాగరూకుడై నిలచియున్నవాడాయెను.

ఇతి శ్రీ బ్రహ్మాండపురాణే ధన్వంతరిపూజావ్రతకథాయాం
ద్వితీయోధ్యాయః

## అథ తృతీయోఽధ్యాయః

శ్లో॥ తతశ్చ శ్రీమాళవేశోపి । స్వకుమారతిరస్కృతిం,
శ్రీపుష్పరథరాజాయ । నివేద్యాతీవదుఃఖితః॥ 1
స్వపుత్రదర్శనాకాంక్షీ । విసస్మారాఖిలం జగత్,
పుష్పవేణీం పుష్పరథః । ఆహూయేదమువాచ హ॥ 2

తా॥ అచ్చట మాళవేశ్వరుడును తనకుమారుడు తమమాటను తిరస్కరించి తపోవనమున కరుగుటయు తద్వృత్తాంతములనెల్ల నతిదుఃఖముతో పుష్పరథరాజు కెరింగించి తనకుమారుడు కంటికెపుడు కనుపించునా యను విచారమున పిచ్చివానివలె జగంబును మరచినవాడై మాటిమాటికి దుఃఖింపుచుండె. అంత అచ్చట పుష్పరథుడా వృత్తాంతమును విని మిక్కిలి వ్యాకులముగలవాడై కుమార్తెయగు పుష్పవేణినిబిలచి యీప్రకారము పల్కినవాడాయెను.

శ్లో॥ జానాస్యఖిలధర్మాంశ్చ । న వక్తవ్యం హి పుత్రికే,
అలభ్యవస్తునిష్ఠాయో । మనోరథ అసాంప్రతః॥ 3

తా॥ అమ్మా నీవెరుంగనిధర్మములు లేవు. నీకు వేరుగ చెప్పనక్కరలేదు. అందరానిఫలమునందాశనుంచుకొని కొందుట మిక్కిలి అప్రశస్తమైన పనిగదా యనెడు మాటలం జెప్పుచు నింకను,

శ్లో॥ సంసారభోగవిముఖః । మాళవాధిపతేస్సుతః,
ఉల్లంఘ్య పితురాజ్ఞాం చ । తపస్తప్తుమగాద్వనం॥ 4

తా॥ మాళవేశ్వరుని కుమారుడు సుప్రకాశుడనువాడు సంసారమును వర్జించి తలిదండ్రులమాటల నిరసించి తపస్సుకొరకై అడవులంబడి పోయినవాడటసుమా.

శ్లో॥ తం మూఢచిత్తం విజ్ఞాయ । పతిమన్యం వృణుష్వ తే,
న కించిదపి వక్తవ్య । మస్మాన్మద్వచనాత్సుతే॥ 5

తా॥ కుమారీ! అటువంటి మూఢచిత్తుడైన సుప్రకాశునియందు మనంబు నుంచక, మరియొకవరుని కోరుకొమ్మని యెంతయో బ్రీతిమాలెను.

శ్లో॥ ఏవం బ్రువంతం పితరం। పుష్పవేణీ దృఢవ్రతా,
సర్వధర్మార్థవేత్తుస్తే। కియన్మన్మూఢమానసం॥ 6

తా॥ ఈ ప్రకారముగా చెప్పుచున్న తన తండ్రియగు పుష్పరథుని వాక్యములాలకించినదై సర్వధర్మములు తెలసినవారును పరిశుద్ధ మనస్కులునునగు తమకు నేను జెప్పజాలను. మూఢురాలనగు నేను తమకేమి చెప్పగలను.

శ్లో॥ తథాపి కించిద్వక్ష్యామి। క్షమస్వ పరమాదరాత్,
మనోవాక్కాయకరణేష్షు సంజ్ఞేషు మనః పరం॥ 7

తా॥ తండ్రీ మీ కెదురు పల్కజాలనుగాని సామాన్యముగా జెప్పుకొను మాటలకు నన్ను క్షమించి ప్రేమతో వినకోరెద. ఎద్దియన మనస్సు, వాక్కు, కాయము అను మూటిలో పెద్దదైన మనస్సు ముఖ్యమైనదిగదా.

శ్లో॥ ప్రధానం మానసే రూఢం। కథం త్యక్ష్యామి భో గురో,
మత్ప్రాణభర్తృపాదేన। పవిత్రితమరణ్యకం॥ 8

తా॥ అట్టి ప్రధానమైన మనస్సుతో వరించిన భర్తను విడనాడుట కన్న అన్యాయమైన కార్యమింకేదైన కలదా? తండ్రీ యిపుడు నాభర్త కొరకు అరణ్యమునకేగి అతనిపాదములచే పవిత్రితమైన భూమిని చూచెదను.

శ్లో॥ ప్రవిశ్యాన్వేష్య నగరీ। మానయిష్యే పతిం పునః,
అనుజానీహి మాం శీఘ్రం। నాన్యథావక్తుమర్హసి॥ 9

తా॥ ఆభూమినంతయు వెతకి నాథర్తను మరల నింటికిం గొని వచ్చెదను. దృఢముగ నిశ్చయించుకొనిన నాకార్యమున కడ్డుజేయక వెంటనే సెలవొసంగి నన్ను పంపుడని పుష్పవేణి తండ్రిని ప్రార్థించెను.

శ్లో॥ పురీమద్భర్తృరహితా । ఘోరారణ్యసమా హి మే,
మద్భర్తృసహితారణ్యం । మణిసౌధసమం పితః॥ 10

తా॥ ఓ జనకా నాభర్త లేనటువంటి పురము మహారణ్యముతో సమానమే యగును. నా యొక్క ప్రాణనాథుడుండు యరణ్యము మణులచే స్థాపితమైన మహాసౌధముగా నుండుననని నాకు తోచుచున్నది.

శ్లో॥ ఇత్యశ్రుపూర్ణనయనా । పపాత పిత్రృపాదయోః,
విలపంతీం పుష్పవేణీ । మాశ్వాస్య చ మహీపతిః॥ 11

తా॥ ఇట్లు నేత్రములనుండి వచ్చు నీరు చేత తన తండ్రిపాదములను తడుపుచు అతిగా విలపించుచున్న పుష్పవేణియొక్క దుఃఖవచనములను వినినవాడై యట్లె యగుగాక యని పుష్పరథు డనినవాడాయెను.

శ్లో॥ మహత్యా సేనయా సార్థం । ప్రేషయామాస పుత్రికాం,
అతీత్య కించిదధ్వానం । మహారణ్యే భయంకరే,
కస్యచిద్వటవృక్షస్య । మూలం రాత్రౌ నిషేవితే॥ 12

తా॥ ఆ మెరక్షణార్థము కొంత సైన్యమునిచ్చి యరణ్యమునకేగ సెలవొసంగె, నంత పితాజ్ఞనుపొందిన పుష్పవేణి సేనాసమేతయై భయంకరమైన యరణ్యము బ్రవేశించి కొంతదూరము ప్రయాణముచేసి సాయంసమయమగుటచే నొక మఱ్ఱివృక్షముకింద నివసించెను.

శ్లో॥ అధ్వాయాసపరిశ్రాంతా । నిద్రాముపగతా చమూః,
తదానీం పుష్పవేణీ తు, పతిదర్శనలాలసా॥ 13

తా॥ మార్గాయాసముచే నలసి సైన్యమంతయు నిద్రచే నైమరచియుండునంత పుష్పవేణి తన ప్రాణనాథుని వెంటనే చూడవలయునని తలచికొనినదై,

శ్లో॥ ఏకాకినీ త్యక్తసేనా । జగామ చ వనాద్వనం,
నదీతీరేషు గుల్మేషు । మున్యాశ్రమపదేషు చ.
అన్విష్యాన్విష్య యత్నేన । న దదర్శ పతిం సతీ॥ 14

తా॥ తన సైన్యమును అచ్చటనే విడచి ఒక తెరయే బయలుదేరి పొదల యందును నదీతీరములందును మునీశ్వరులయాశ్రమములందును వెతకుచు నెచ్చటను తన భర్తను గానక విచారించుచు నున్నదాయెను.

శ్లో॥ నిశీథసమయే సా తు । చింతయంతీ పతిం ప్రతి,
హా సుప్రకాశ హా ధీర । హా మారసుకుమారక,
హా మాళవమహారాజకుమారక మహామతే॥ 15

తా॥ పుష్పవేణియు నొకనాటి అర్ధరాత్రికాలంబున నా కింకను ప్రాణనాధుడు కనుపించకపోయె. ఇంక నెందున్నాడో యని పెద్దగా విచారపడుచుండ కొంతదూరమునుండి హా సుప్రకాశా స్నేహితుడా మాళవేశ్వరకుమారకా హా యనియు,

శ్లో॥ అవేహి మాం సహచరం సునీతిం నీతికోవిద,
ఏకాకీ మాం పరిత్యజ్య । స్వర్యానం తేన సాంప్రతం॥ 16

తా॥ ఓ సుప్రకాశా నేను సునీతియను నీ ప్రియమిత్రుడను ఒకసారి తెమ్మ తెమ్మని అనియు, నన్ను ఒంటరిగా విడచివెళ్ళుట నీతిమంతుడవైన నీకు పాటిగాదు అనియు.

శ్లో॥ ఇత్యార్తరవమాకర్ణ్య । పుష్పవేణీ భయాతురా,
సుప్రకాశేతి వర్ణానాం । శ్రవణేనాతివిహ్వలా॥ 17

తా॥ ఈ ప్రకారము హా సుప్రకాశా యని సునీతివర్ణనచే ఆర్తస్వ యున్న ధ్వనియంతయు పుష్పవేణికి వినవచ్చినంతనె అమిత భయమును తొందరయు కలిగినదై,

శ్లో॥ రవానుసారిణీ గత్వా । నదీం కాంచిద్దదర్శ సా,
తత్తీరే తు మృతం కంచి । దుపాస్యాతీవ దుఃఖితః॥ 18
రాజలక్షణసంపన్నః । పుమాన్ కశ్చిద్ద్రశోర్గతః॥

తా॥ ఆధ్వని వినబడుచున్న ప్రాంతమునకు పుష్పవేణి వెళ్లగా నచ్చట నొక నదీతీరమున చనిపోయిన యొకానొకని దరిజేరి బహుప్రకా

రముల విలపించుచున్న రాజలక్షణ సహితుడగు నొక పురుషుని గాంచిన దాయెను.

శ్లో॥ ఉపసృత్య మహీపాల।నందనం పతితంభువి,
మిత్రాక్తరవవిజ్ఞాత । స్వభర్తృచరితాసతీ॥ 19

తా॥ అంతట పుష్పవేణి వారిని సమీపించి సునీతియార్తనాదమున వెలువడు మాళవనాథకుమారా సుప్రకాశాయను వాక్యములచేతను భూమి యందు పడియున్న రాజపుత్రునియందు వెనుక తానుచూచిన చిత్రపటము నందుగల చిహ్నములు కనుపించుటచేతను తన భర్తయేయని తెలుసుకొనిన దాయెను.

శ్లో॥ అత్యాహితేన దుఃఖేన। సుప్రకాశకళేబరే,
నిపత్యమూర్ఛామగమ । త్పుష్పవేణీ పతివ్రతా॥ 20

తా॥ పతివ్రతయగు పుష్పవేణి యాతురతతో దుఃఖించుచు సుప్రకాశక ళేబరమువద్దకొచ్చి హా నాథాయని దానిపైపడి మూర్ఛజెందెను.

శ్లో॥ ఆశ్వాస్యచ సునీతిస్తాం । విస్మయావిష్టమానసః, .
పుష్పవేణ్యాస్తువృత్తాంత । మశృణోచ్చతతస్స్వయం॥ 21

తా॥ అంత సునీతియు ధైర్యముతెచ్చుకొని యాశ్చర్యపడినవాడై యామె నూరడించి, యా పుష్పవేణీవృత్తాంత మంతయు యామెవలన విని తెలిసికొనినవాడాయెను.

శ్లో॥ స్వస్యశ్రీసుప్రకాశస్య । చరితంప్రాహవిస్తరం,
సర్పదంశేన మరణం । శృత్వాభర్తుశ్చసాసతీ
శోకసాగర సంమగ్నా । హ్యనుగంతుం మనోదధే

తా॥ పిదప సునీతియు సుప్రకాశునిచరిత్రమువంతయు నామెకు వినిపించెను. తాము అడవులకువచ్చుటయు, శాస్త్రాభ్యాసమున గురునాజ్ఞను గొనుటయు, నదీతీరమున విడిదిసేయుటయు, హఠాత్తుగా నొక ఘోర సర్పము వచ్చి సుప్రకాశుని కాటందుటయు మొదలగు వృత్తాంతములను

విని మిక్కిలి శోకించి, తానుగూడు తనభర్తతో సహగమనము చేయ పుష్ప వేణి ఉద్యుక్తురాలాయెను.

శ్లో॥ తత్పాతివ్రిత్య సంప్రుష్టమానసః పరమేశ్వరః,
అశరీరగి రావోచ దితి ధన్వంతరిం భజ॥ 23

తా॥ అంతలో నాపుణ్యవతియగు పుష్పవేణియొక్క పాతివ్రిత్యము నకు మిక్కిలి సంతోషించి పరమేశ్వరుడు ఆకాశవాణిరూపముగ శ్రీధన్వం తరి నారాధించుమూ యని పలికినవాక్యము వినవచ్చెను.

శ్లో॥ తదా ధన్వంతరింధ్యాత్వా । పూజయామాస భక్తితః,
తద్ధూపధూమసంస్పర్శా । త్సుప్రకాశో జజీవ హ॥ 24

తా॥ భగవద్వాక్యము వినినతోడనే భక్తిపూర్వకముగా ధన్వంతరిని ధ్యానించి పూజించెను. శ్రీధన్వంతరికి నాఘ్రాణింపజేసిన ధూపధూమము ఆసుప్రకాశునిశరీరమున దాకినంతనె యాతడు సజీవుడయ్యెను.

శ్లో॥ సునీతిస్సుప్రకాశశ్చ । పుష్పవేణీ సుశీలతాం,
ప్రశంసంతౌ తయాసార్థం । స్వపురీమేత్యసుస్థిరం॥ 25

తా॥ పతివ్రతాశిరోమణియగు పుష్పవేణిని, సుప్రకాశుడును, సునీతియు పొగడుచు తమయాపత్తు లన్నియునివారణజేసిన దేవదేవుడగు శ్రీ ధన్వంతరిమహిమను కొనియాడుచు నా ముగ్గురును బయలుదేరి తమస్వనగ రమును ప్రవేశించిరి.

శ్లో॥ రాజ్యం లబ్ధ్వా బంధులోకం । ప్రజాశ్చారంజయచ్చిరం,
ప్రతిపర్వణి సంక్రాంతౌ । శ్రీమద్ధన్వంతరేర్వ్రతం,
చరన్ చిరాయుకాలేతు । స్వర్గలోక మియాయసః॥ 26

తా॥ అట్లు క్షేమపట్టణమున ప్రవేశించి రాజ్యమును పొందినవాడై బంధువులను ప్రజలను పెక్కు సంతోషింపజేయుచునుండి చిరకాలము పుష్పవేణిసుప్రకాశులు ప్రతిపర్వమందును ప్రతిసంక్రాంతియందును శ్రీధన్వంతరివ్రతము నాచరించుచు ఇహమున సమస్తైశ్వర్యముల ననుభవించి పరమునందు స్వర్గసుఖమును పొందినవాడాయెను.

శ్లో॥ ఏవం నారాయణేనోక్తం । నారదాయమహాత్మనే,
ఇత్యేతత్కథితం విప్రాః । కిమన్యచ్ఛ్రోతుమిచ్ఛథ॥ 27

తా॥ శ్రీమన్నారాయణమూర్తి ఈకథ నంతయు నారదమహామునికి ఉపదేశించె. ఆనారదమహాత్మునివలన నేనువినినదంతయు మీకెఱింగించితి నని సూతుండు శౌనకాదులతో చెప్పినవాడాయెను.

ఇతి బ్రహ్మాండపురాణే ధన్వంతరిపూజావ్రతకథాయాం
తృతీయోధ్యాయ స్సమాప్తః.

## అథ చతుర్థోధ్యాయః

సూతఉవాచ:-

శ్లో॥ అథాన్యాం సంప్రవక్ష్యామి । గాథాం పాపప్రణాశినీం,
శ్రీమన్నారాయణేనోక్తాం । నారదాయ మహాత్మనే॥ 1

తా॥ శౌనకాదిమహామునులారా నారదునకు నారాయణుం డుపదేశించిన మరియొకపుణ్యగాథను చెప్పుచున్నా నాలకింపుడని సూతుం డిట్లనియె.

శ్లో॥ అస్తి వైవస్వతమనోః । పుత్రశ్శర్యాతినామక,
సుతాతస్య సుకన్యాఖ్యా । సర్వలక్షణలక్షితా॥ 2

తా॥ వైవస్వతమనువుకుమారుడగు శర్యాతియనురాజు కలడు. నా రాజునకు సర్వలక్షణయుక్తయైనటువంటి సుగుణవతియగు సుకన్యయను కుమార్తె కలదు.

శ్లో॥ ఏకదాతు సఖీభిస్సా । విలాసార్థం వనం యయౌ,
తత్రతత్ర చరిత్వాతు । వల్మీకం కంచనాసదత్॥ 3

తా॥ ఒకానొకపుడు సుకన్యయను నామె చెలికత్తెలతోగూడి వనవిహారమునకేగి నచ్చటచ్చట తిరుగుచు ఒకపుట్టయొద్దకు వచ్చినదాయెను.

శ్లో॥ తద్రంధ్రని స్సరత్కాంతిం। విలోక్యాతీవవిస్మితా,
కాష్ఠేన కేనచిద్రంధ్రం । చాపలేన తుతోదసా॥ 4

తా॥ అప్పుడావల్మీకరంధ్రమునుండి తేజస్సు ప్రసరించుటజూచి యా సుకన్య చపలచిత్తయై యొక కఱ్ఱతో వల్మీకరంధ్రమున గ్రుచ్చినదాయె.

శ్లో॥ వల్మీకాంత స్తపస్యంతం । చ్యవనం నవివేదచ,
తత్కాష్ఠపీడనాత్తస్య । చక్షుషీనాశనంగతే॥ 5

తా॥ అపుట్టలోన తపస్సు చేయుచున్న చ్యవనమహాఋషికన్నులలో సుకన్యచే పొడవంబడిన కఱ్ఱ దిగినందున కండ్లుపోయినవాయెను.

శ్లో॥ రుధిరస్యచ నిస్రావం । విలోక్యభయవిహ్వలా,
నగరాభిముఖీ శీఘ్రం । వివేశ స్వీయమందిరం॥ 6

తా॥ ఆమహాఋషికండ్లుపోవడమేగాక యధికముగా రక్తముకూడా స్రవించెను. అదిచూచి భయాతురతతో సుకన్య వెంటనే తనపట్టణమున గల ఇంటినిగూర్చి వెళ్ళినదాయెను.

శ్లో॥ సర్వాః పౌరప్రజాశ్చైవ । మలమూత్రనిరోధతః,
నిమగ్నాశ్చ రుజాక్రాంతా । దుస్తరే దుఃఖసాగరే॥ 7

తా॥ ఆమహర్షికి సుకన్యచేసిన యపచారముచేత గ్రామమునందు సమస్తప్రజలకు మలమూత్రములు బంధించినవగుటచే నావ్యాధిని భరింపజాలక గొప్ప దుఃఖసాగరమునం దున్నవారైరి.

శ్లో॥ కిమేతదితిసమ్మూఢా । చేతాస్తత్పురపాలకః,
భగవంతం మహాత్మానం । ప్రార్థయామాస భక్తితః॥ 8

తా॥ అంత పురప్రజలు మూఢాత్ములై యీ మహద్దుఃఖమునకు కారణ మరయలేక, మహాత్ముడైన భగవంతుని భక్తియుతులై ప్రార్థింపు చుండిరి.

శ్లో॥ భయకంపితసర్వాంగీ । సుకన్యాపితురంతికం,
ఉపేత్యదుశ్చిక్రియాంస్వీయా। మఖిలాం తాంన్యవేదయత్ ॥ 9

తా॥ ఇచట సుకన్య భయముచే సర్వావయవములు వణకుచున్నదియై తన తండ్రివద్దకు వచ్చి అనాడు తనవనవిలాసమును, అచట వల్మీకమునందు తాను జేసిన యపరాధవృత్తాంత మంతయు జెప్పెను.

శ్లో॥ తస్మాన్మలకామేవబాధా । మేతాంజ్ఞాత్వానృపోత్తమః,
పరివారపరీతస్త । ద్వల్మీకాగ్రముపాగమత్ ॥ 10

తా॥ ఆ శర్యాతిరాజు, తన ప్రజలకు కల్గిన మలమూత్రబంధవ్యాధి యావత్తును, తనకుమార్తెచేసిన యపచారదోషముచే సంభవించినదని తెలుసుకున్నవాడై పరివారసహితముగా ఆ పుట్టవద్దకు వచ్చినవాడాయెను.

శ్లో॥ స్రంసయిత్వాతు వల్మీకం ।దృష్ట్వాచ్యవన మూచివాన్,
మహాత్మన్ సర్వధర్మజ్ఞ । సత్యరూప మహామునే॥ 11

తా॥ అపుట్టను చక్కగా విడియగొట్టిచూడగ అందు మహనీయుడగు చ్యవనమహర్షి కనబడియెను. వానింజూచి రాజు ఓ మహాత్మా సర్వధర్మముల నెరింగినట్టియు శాంతస్వరూపుడవును మౌనవ్రతముగల మహానుభావా!

శ్లో॥ త్రికాలజ్ఞానసంపన్న । నిగ్రహానుగ్రహక్షమ,
అజ్ఞానదగ్ధచిత్తాస్తు । మాదృశాస్త్వత్ప్రభాంకథం॥ 12

తా॥ భూతభవిష్యద్వర్తమానముల నెరింగినట్టియు నిగ్రహానుగ్రహ సమర్థుడవైనట్టియు ఓర్పుకలిగినవాడవును. నీయొక్క మాహాత్మ్యము నెరుంగుటకు మూర్ఖచిత్తులమగు మే మెంతవారము.

శ్లో॥ విన్యస్తత్వాత్మకేనిత్యే । పరేబ్రహ్మణి సంస్థితాం,
అస్మత్సుతాకృతం పాపం । క్షంతుమర్హాసి భోమునే॥ 13

తా॥ నీకొనర్చినట్టి యపరాధవశమున మలమూత్రబంధమై మాప్రజలును మేమును మిగుల దుఃఖించుచున్నాము. నాకొమార్తె యెరుంగక జేసిన

యపరాధమును క్షమింపుము. మాబాధలు శమింపజేయవే యని రాజు ప్రార్థించుచు నింకను,

శ్లో॥ సర్వలక్షణసంపన్నాం। కన్యాం స్వీయాం దదామి తే,
యథాచాస్మత్ప్రజాస్సర్వా।వయంచసుఖితాంయయుః॥ 14

తా॥ మీకోపము శాంతించుటకై సర్వలక్షణసమేతయగు నాకుమార్తె సుకన్యను తమకు భార్యగా సమర్పించుచున్నాను గనుక దయాపూర్వకముగ స్వీకరించి మమ్మును ప్రజలను బాధలనుండి తొలగించి రక్షించుమా యని శర్యాతిరాజు వేడుకొనియెను.

చ్యవన ఉవాచ:-

శ్లో॥ పరేబ్రహ్మణిసుస్థస్య। కిం మే సాంసారికం సుఖం,
తథాపి సర్వలోకానాం। సుఖసంపాదనాయతు॥ 15
సత్కులీనాం గుణాఢ్యాంచ। స్వీకరోమి తవాత్మజాం,
యది సా కామయే దంధం। వలీపలితసంయుతం॥ 16

తా॥ అంతట చ్యవనుడు కేవల సత్వరూపుడు గావున అనుగ్రహము కలవాడై సకలప్రజాహితార్థముకొరకు యా సుకన్యను పరిగ్రహింపదలచి ఓరాజా ముసలివాడను అంధుడనునైన నన్ను నీపుత్రిక పరిగ్రహించుట క్లిష్టపడునేని పరబ్రహ్మనుసంధానపరుడనైనను లోకహితమునకై పరిణయము చేసికొందుననియెను.

సుకన్యోవాచ:-

శ్లో॥ సర్వసిద్ధిమనస్సర్వా।శక్తిసంపన్నచేతసః
పరిగ్రహశ్చ్యభవతః। కింమే భాగ్యమతఃపరం॥ 17

తా॥ ఆ వాక్యముల నాలకించి సుకన్య ఓమహాత్మా తమవంటి మహనీయునకు భార్యనై పరిచారకురాలుగ నుండుటకంటె నాకు మరియొక మహోన్నతసంపద కలదా యని విన్నవించె.

శ్లో॥ ఇత్యాకర్ణ్యవచ_స్తస్యాః । చ్యవనశ్చ ప్రజాపతిః,
తస్యాస్తు గుణసంపత్తే । ర్ముదమాపతు రంతరే॥ 18

తా॥ అంత ముద్దులొల్కు సుకన్యపలుకులు వినినంతనే చ్యవనుడును శర్యాతిరాజును సుగుణసంపత్తినిగూర్చి మిగుల సంతోషించినవారైరి.

శ్లో॥ తదానీమేవ తాం కన్యాం । చ్యవనాయ మహాత్మనే,
ప్రాదాత్తతోజనాస్సర్వే । సుఖం జగ్ముర్యథాపురా॥ 19

తా॥ వెంటనే రాజు యాసుకన్యను చ్యవనమహాఋషికి నిచ్చి వివాహము జేసెను. అంతట ప్రజలెల్లరును సమస్తబాధలనుండి విముక్తులై పూర్వమువలె సమస్తసుఖములనందుచు ఆరోగ్యవంతులైయుండిరి.

ఇతి బ్రహ్మాండపురాణే ధన్వంతరిపూజావ్రతకథాయాం
చతుర్థోధ్యాయ స్సమాప్తః.

## అథ పంచమోఽధ్యాయః

శ్లో॥ తతఃప్రభృతిసాసాధ్వీ । భర్తృసేవాపరాయణా,
భర్తులోచనతారుణ్య । మాకాంక్షంతీ శుచివ్రతా.
శ్రీమద్ధన్వంతరేః పూజా । మకార్షీద్భర్తృచోదితా॥ 1

తా॥ అదిమొదలు సుకన్యయను సాధ్వీమణి నిరంతరమును భర్తృసేవయం దప్రమత్తురాలై తనభర్తకు నేత్రములును, యౌవనమును, సంపాదింపగోరి మనోరథఫలమిచ్చుటకు ధన్వంతరిదక్క నన్యదేవులు సమర్థులు కారని యెంచి, తనభర్తయానతిప్రకారము శ్రీ ధన్వంతరవ్రతమును చేయనుద్యమించినదాయెను.

శ్లో॥ కార్తికే కృష్ణపక్షేతు । త్రయోదశ్యాం గురోర్దినే,
దశావరణచక్రేతు । శ్రీమద్ధన్వంతరిం హరిం॥ 2

ఆవాహ్య మంట పేతత్రా । ప్యశ్వినౌస్వర్గనాయకం,
దివాకరం చౌషధీశం । దక్షం బ్రహ్మాణ మవ్యయం॥ 3
ఆత్రేయంచ భరద్వాజం । హారీతం కాశ్యపం మునిం,
సంపూజ్య విధివద్భక్త్యా । సుకన్యాచ్యవనౌతదా॥ 4

తా॥ అంత శుచిగలదై, కార్తిక కృష్ణత్రయోదశీ గురువారమున శ్రీహరియైన ధన్వంతరియొక్క దశావరణచక్రమందు తొలుత, శ్రీధన్వంతరిని ధ్యానావాహనములుగావించి, తన్మంటపముచుట్టును, క్రమముగా దక్షప్రజాపతియు, ఇంద్రుడు, అశ్వినీదేవతలు, ఆత్రేయుడు, హారీతుడు, కాశ్యపుడు, సూర్యుడు, చంద్రుడు, భరద్వాజుడు వీరలను ఆవాహనముజేసి కల్పోక్తవిధానముగ భక్తితో చ్యవనసహితముగా సుకన్య పూజించెను.

శ్లో॥ గోధూమచూర్ణం గోసర్పిః । ద్రాక్షాదీని ఫలానిచ,
కుంకుమంఘనసారంచ । త్రిసుగంధం చ శర్కరాం,
మేళయిత్వాతు నైవేద్యం చక్రతుస్తౌ మహాత్మనే॥ 5

తా॥ పూజలొనర్చిన పిమ్మట గోధుమపిండి అవుపాలు నెయ్యి పంచదారయు నేకము చేసి పక్వముగావించి, పచ్చకర్పూరం కుంకుమ పువ్వు ఏలకులు ద్రాక్ష ఖర్జూరపండ్లు లవంగాలు దాల్చినిచెక్క జాపత్రి వీట్లను మెత్తగ చూర్ణించివైచి, బాగా కలియకలిపి, సిద్ధము చేయబడిన ప్రసాదమును పరివారసహితుడైన యా శ్రీమహాధన్వంతరికి నివేదన మొనర్చినవారుకాగా,

శ్లో॥ తత్ప్రభావాత్తు చక్షుష్మాన్ । బభూవ చ్యవనోమునిః,
తత్సంతోషాద్విసస్మార । తత్ప్రసాదస్యభక్షణం॥ 6

తా. తద్వ్రతప్రభావము చే భర్తయొక్క కన్నులు తక్షణమే కనుపించెను. వ్రతఫలము వెంటనే పొందుటజేసి మిగుల సంతోషముచే ప్రసాదస్వీకారమును మరచెను.

శ్లో॥ తస్మాల్లోచనమేవాస్మై । దత్త్వా తారుణ్యసంపదం,
న దత్తవాన్ ప్రసాదస్య । పరిత్యాగాన్మహాప్రభుః॥ 7

తా॥ అంతట చ్యవనునికి లోచనములు మాత్రమిచ్చి, మిగుల సంతోషము చేత ప్రసాదభక్షణము మరచుటచే ధన్వంతరిభగవానుడు కోపించి యౌవనము నీయకుండెను.

శ్లో॥ తతః ప్రభృత్యసంపూర్ణ।తోషా పత్యుస్సమర్చనాం,
కుర్వంతీ యాపయామాస । కతిచిద్దాయనానితు॥ 8

తా॥ సుకన్యయు తనకోర్కె సంపూర్తికానిదై పదేపదే యాభగవానునికి ప్రార్థనాపూజలు సలుపుచు కాలము గడుపుచున్నదాయెను.

శ్లో॥ సర్వదీనశరణ్యస్య । దయాసింధోర్మహేశితుః,
కిన్నుఖల్వమితః కోప । స్సముజాయత దుర్భరః॥ 9

తా॥ యౌవనదానము చేయకుండుటచే సర్వదీనరక్షకుడును దయామయుడును అగు నాధన్వంతరికి కోపమువచ్చియుండునాయని సుకన్య శంకించుకొనుచున్నదాయెను.

శ్లో॥ దత్త్వా లోచనయుగ్మంతు । తారుణ్యంచ నదత్తవాన్,
నజానామి చ మద్దోషం । స్యాచ్చేత్క్షంతుం త్వమర్హసి॥10

తా॥ ఓ మహాత్మా నాయపరాధమును ఇదమిత్థమని నిర్ణయింపజాలకున్నాను. ఏయపచారములు చేసితినో మన్నించి రక్షింపుము రక్షింపుమాయని వేడుకొనుచున్నదై,

శ్లో॥ కిమేతదితి సంతప్త।హృదయాతు సుకన్యకా,
తవధన్వంతరే పాద।పద్మాన్నాన్యాగతిర్మహ॥ 11

తా॥ శ్రీమహాధన్వంతరి పాదపద్మములే నాకు శరణ్యమని సంకల్పించుకొని అన్యథా నమ్మకములేక మరల నిన్ను నాశక్తికొలది పూజించుదునని సుకన్య దేవుని పాదములయందు పడినదాయె.

శ్లో॥ ఇతిసంచింత్య మనసా । దధ్యాధన్వంతరింతదా,
ఆవశ్యకాని ద్రవ్యాణి । సమీక్ష్యత్యాదరాద్భృశం॥ 12

తా॥ ఈప్రకారము ఆధన్వంతరివ్రతము నాచరించుదునని మనః పూర్వకముగ ధ్యానించి ఇందుకు కావలసిన ద్రవ్యముల నన్నిటని సన్నద్ధ పరచుకొనినదట.

శ్లో॥ వైశాఖమాసప్రతిపదారభ్యాదశమీతిథిం,
ధన్వంతరేః కృపాం లబ్ధుం । చకారవిధివద్వ్రతం॥ 13

తా॥ వైశాఖమాసప్రతిప త్తిథి మొదలు చేసుకొని దశమీతిథివరకు పది రోజులు శ్రీధన్వంతరికరుణాకటాక్షమ్ము నపేక్షించి విధిప్రకారము ఆ వ్రతమును చేసినవారగుచు నింక,

శ్లో॥ భక్షయంతౌ ప్రసాదంతు । దశరాత్రైకదీక్షయా,
నిరాహారౌ యతాత్మనౌ । పూజయాంచక్రతుస్తారిం,
విస్మృత్య ప్రాక్తనం కోపం। యౌవనంతస్య దత్తవాన్॥ 14

తా॥ భార్యాభర్త లిరువురును. నియమముగలవారై నిరశనవ్రత మూని ధన్వంతరిప్రసాదభక్షణము చేతనే జీవితమును నిల్పుచు నా పది రాత్రములు వ్రతమును తదేకదీక్షతో ముగించిరి. అంత అల్పసంతోషియు దయాసముద్రుండును భక్తసులభుండగు శ్రీధన్వంతరి కటాక్షించి యా చ్యవనునకు యౌవనమును అనుగ్రహించినవాడాయెను.

శ్లో॥ నవయౌవన సంపన్నో । మారసుందరవిగ్రహః,
సుకన్యాయై తదాసీంతు । లోచనానందదాయకః॥ 15

తా॥ దేవుని సుకల్పప్రభావము చేచ్యవనుడు సంపూర్ణయౌవనమును ధరించి మన్మథుని ధిక్కరించు లావణ్యముగలవాడయ్యెను. అతనింజూచి సుకన్య అత్యానందభరితురాలాయె.

శ్లో॥ బభూవచ్యవనస్తత్రః । శ్రుత్వాధన్వంతరివ్రతం,
స్వర్గే మర్త్యేచపాతాళే । వ్యాళసే వ్రతముత్తమం ॥16

తా॥ ఈధన్వంతరివ్రతమాహాత్మ్యమును చ్యవనమహాముని వలన వినిన వారై స్వర్గమర్త్యపాతాళలోకములందలి దేవతలును మనుష్యులును నాగప్రముఖులెల్లవారును ధన్వంతరివ్రతము నాచరించి వజ్రదేహులై అఖండసుఖమును పొందిరి. ఈవ్రతము జగత్త్రయమును వ్యాపించినదాయెను.

శ్లో॥ జ్వరార్శఃప్లీహగుల్మైశ్చ । కుష్ఠకర్ణాక్షిసంభవైః,
అతీసారామ్లపిత్తాదిమహారోగైశ్చదారుణైః 17
నరాః ప్రపీడ్యమానా యే । ధన్వంతరిసమర్చనాత్,
తత్క్షణాదేవ ముచ్యంతే । సత్యం సత్యం వదామి తే॥ 18

తా॥ జ్వర, గుల్మ, ప్లీహ, అర్శః, కుష్ఠ, ఆమ్లపిత్త, కర్ణ, నేత్ర, అతిసారాదిమహారోగపీడితులు ఈవ్రతమును, ఒకమారు భక్తిపూర్వకముగ నాచరించినచో నాయా రోగములందు విముక్తులై తప్పక సుఖమును పొందుదురు. ఇది సత్యము.

శ్లో॥ రోగైకప్రచురేతిష్యే-నాస్త్యస్మాన్నిష్కృతిః పరా॥ 19

తా॥ రోగభూయిష్ఠమైన కలియుగమునందు శ్రీధన్వంతరివ్రతము కంటె మరొకవ్రతము ఒకటియు, ఆరోగ్యసాధనమునకు లేదనుట నిజము.

శ్లో॥ వంధ్యాతు లభతే పుత్రాన్ - గుణినశ్చిరజీవినః,
మృతగర్భాతు యానారీ - చిరజీవిసుతాభవేత్॥ 20

తా॥ వంధ్యయగు స్త్రీలు యీవ్రతముచేసినయెడల నిశ్చయముగ పూర్ణఆయుర్దాయముగల సుగుణవంతుడగుపుత్రుడుగల్గును. మృతగర్భముగల యువతులీవ్రతము నాచరించిన శతాయుర్దాయముగల సంతానముగలుగును.

శ్లో॥ అజరామరకృత్సర్వ-రోగనాశకరం పరం,
భుక్తిముక్తిప్రదంలోకే - సకృదాచరణాద్భువి॥ 21

తా॥ ముసలితనమును బోకడచి ఆయుర్దాయమును దేవత్వమును యిచ్చుటలోను భుక్తిని ముక్తిని గూర్చుటలోను సర్వవ్యాధులను నశింప

శేయుటయందును ఉత్తమసాధనమైన యీవ్రతముజేసినవారలు సర్వఫలములు బొందుదురు.

శ్లో॥ య ఇదంకురుతే శ్రీమాన్ - శృణోతిచ కథాం బుధః,
పఠనం కుర్వతే యేచ - తే యాంతి పరమాంగతిం॥ 22

తా॥ ఈ వ్రతము నాచరించిన మహాత్ములును, జదివినవారును, వినినవారు, చెప్పినవారు చూచినవారును క్రమముగ నుత్తమగతులం బొందుదురు.

శ్లో॥ కాంక్షంతి యే మనుష్యాస్తై - ఆయురారోగ్యసంపదం,
అవశ్యాచరణీయం తై - ర్ధన్వంతరివ్రతం శుభం॥ 23

తా॥ ఆయురారోగ్యసంపదలను అభిలషించు ప్రతిమానవుడును సర్వశుభదాయకమగు నీ ధన్వంతరిపూజావ్రతము శీఘ్రముగా నాచరించ వలసినదిసుమా.

శ్లో॥ ఏవం నారాయణేనోక్తం - నారదాయ మహాత్మనే,
ఇత్యేతత్కథితం విప్రా - స్సత్యధన్వంతరేర్వ్రతం॥ 24

తా॥ ఈవిధముగ శ్రీమన్నారాయణుండు నారదమహాఋషికి ఉపదేశించెనని సూతుండు శౌనకాది మహాఋషులతో ధన్వంతరివ్రతకథనము చెప్పి సంతోషపరచినవాడాయెను.

శ్లో॥ స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం,
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః,
గోబ్రాహ్మణేభ్యః శుభమస్తునిత్యం,
లోకాస్సమస్తా స్సుఖినో భవంతు॥

శ్లో॥ మంగళం సాగరోద్ధాయ - పీయూషకలశాయచ,
ఆయుర్వేదస్వరూపాయ - మంగళం శుభహేతవే॥

శ్లో॥ కాయేనవాచా మనసేంద్రియైర్వా,
బుద్ధ్యాత్మనావా ప్రకృతేస్స్వభావా,
త్కరోమి యద్యత్సకలం పరస్మై,
నారాయణాయేతి సమర్పయామి॥

శ్లో॥ యదక్షరపదభ్రష్టం - మాత్రాహీనంచ యద్భవేత్,
తత్సర్వం క్షమ్యతాం దేవ - ధన్వంతరి నమోస్తుతే॥

ఇతి శ్రీబ్రహ్మాండపురాణే ధన్వంతరిపూజావ్రతకథాయాం
పంచమోధ్యాయ స్సమాప్తః.

శ్రీమద్ధన్వన్తర్యర్పణమస్తు లోకా స్సుఖినోభవంతు శుభం శుభం.

గద్య.

ఇతి శ్రీకృష్ణామండలాంతర్గత బెజవాడపురసమీప కృష్ణవేణీనదీతటసంస్థిత చోడవరపురనివాసుండును శ్రీ చెన్నకేశవచరణారవింద నిత్యసేవారాధక శ్రీ విఖనోమునీంద్రసూత్ర యజుశ్శాఖాప్రవర్తకుండును భార్గవ గోత్రతిలక వేదాంతాన్వయవిరాజమాన శ్రీ భగవచ్ఛాస్త్రత్యాది పండిత నరసింహాచార్య వేంకటలక్ష్మాంబా తనూభవుండును ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ భిషక్పుంగవ రాజవైద్య బిరుదావళీ యశోవిశాలురును ఉ. వే. శ్రీయుత దీవి వేంకటాచార్యప్రియశిష్యుండును సకలసహృదయజనవిధేయ వైద్యవిద్యాభూషణ భిషగ్రాజ బిరుదాంకిత లక్ష్మణాచార్యవర్యుని చే సముద్ధృతంబై రచింపంబడిన పురాణోక్త శ్రీ ధన్వంతరిపూజావ్రతకల్పము సమాప్తము.

# ప్రకటన.



శ్రీయుత శ్రీమాన్ రాజవైద్య దీవి వేంకటాచార్యులు గారి వసంతకుసుమాకరము మొదలగు నన్నిఖుజ్జలీ ఔషధములును, సిద్ధమకరధ్వజము మొదలయిన వంశ్యాపశ్యములు, పాషాణభాండవకర్పూరములు, అభ్రికం కాంతం వగైరా పుటభస్మసిందూరములు, భైరవలు, గుళికలు, వటుకములు, రసాయనములు, తైలములు, లేహ్యములు, ప్రాశనములు, ఆసవారిష్టములు, అస్త్రములు, చూర్ణములు, క్వాథములు, కలకములు, అంజనములు వగైరా అన్ని ఔషధములును, శాస్త్రసాంప్రదాయములచే కొన్నితరములనుండి నిపుణతగా చేసి అందరికిని సులభసాధ్యముగా నుండునటుల సరసమగు ధరలతో నివ్వబడుచున్నవి. బ్రాంచీలుగా పెట్టుకొనువారికి మంచి కమీషన్ నిర్ణయించబడును.

గవర్నమెంటువారి వలన నె 2411 రు జీ.వో. ప్రకారం తయారుచేయబడినఔషధములు, ఇంకను పేటెంటుమందులును క్రియముకు దొరుకును గాన వలయువారలు అడ్రస్సుకు వ్రాసి తెప్పించుకొనవచ్చును.


సనాతనాయుర్వేద ఫార్మసీ, (రిజష్టర్డు)

వణుకూరు,

కంకిపాడు పోష్టు, కృష్ణాజిల్లా.

# ప్రకటన.

పశ్చిమ గోదావరిజిల్లా ఏలూరు తాలూకా పెదపాడు పోష్టు నాయుడుగూడెం నివాసులైన మహారాజశ్రీ విద్వద్వైద్య పండిత మద్దుకూరి రామబ్రహ్మం చౌదరిగారిచే శాస్త్రీయ సాంప్రదాయముల ననుసరించి సిద్ధముచేయబడిన అవుషధములలో కొన్నిటిని మాత్రము నిందు తెలుపుచున్నాము.

శతపుట కృష్ణాభ్రక శింధూరము, లోహభస్మములు, శింధూరములు, వంటఖజ్జలీ అవుషధములు సమస్తమగు ఔషధములును క్రియమునకు సిద్ధముగానున్నవి. సదరు గ్రామ నివాసస్తులున్నూ అధికభూస్వాములు అత్యధిక ధనవంతులు నగు కీర్తిశేషులైన మహారాజశ్రీ గారపాటి సాంబయ్య చౌదరిగారి ఆదరణముచే తయారుకాబడిన, వసంత కుసుమాకరం, శిద్ధమకరధ్వజం, నవలోహచింతామణి, స్వర్ణసూర్యావర్తి, స్వర్ణమాల్యవసంతం, లక్ష్మీవిలాసరసం, రక్తమాహేశ్వరరసం, సూతికాభరణం, పూర్ణచంద్రోదయం, యీ ఔషధములు పలువురచే కొనియాడబడుచున్నవి. సరసమైన ధరలకు యివ్వబడును. గాన వలయువారలు పై అడ్రసుకు వ్రాసి తెప్పించుకొనవలయును.

ఈ గ్రంథము వలయువారు :—

శ్రీమాన్ శ్రీయుత వైద్యవిద్వాన్

వేదాన్తం లక్ష్మణాచార్యులు గారు,

చోడవరం, కంకిపాడు పోష్టు.

బెజవాడ తాలూకా, కృష్ణాజిల్లా.